శ్రీ

# వనమాలి

## ప్రథమ ద్వితీయ భాగములు

---

సంపాదకులు

గాదె నరసింగరావు పంతులుగారు
బి. ఏ. ఎల్. టి.



ప్రకాశకులు

రెడ్డిసోదరులు

రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.

1932

 [వెల 12 అణాలు

# విషయసూచిక



## ప్రథమ భాగము



## ద్వితీయ భాగము

# ఒక మాట



ఆంధ్రమున గద్యపద్యరచన కాదర్శములు కవిత్రయమువారి ప్రయోగములన్న యభిప్రాయము సర్వజనసమాదరణము వడసియున్నది. ప్రయోగములనునది శబ్దములు, శబ్దార్థములకే సాధారణముగా వాడుచున్నారు. ఇదియే ముఖ్యముగా రచనాకౌశలమునకు వలయునదైనను కథాసందర్భములందును వివిధము లగు వర్ణన లందును కవిత్రయము వారు త్రొక్కిన మార్గములు వారి గ్రంథములు సాంతముగ చూచినగాని తెలియ శక్యముగాదు. సర్వజనసమాదరణము వడసి సర్వసామాన్య ప్రచారములో నున్న భారతమునుంచి వివిధసందర్భములేర్చి వాటియం దేకవి యేమార్గము నవలంబించెనో దిక్ప్రదర్శనముగ చూపుటయే యీ "వనమాల" యందలి ముఖ్యోద్దేశము. నన్నయ, తిక్కన, యెఱ్ఱాప్రగడలను కవిపుంగవులయొక్క శయ్యాపాకాది భేదములు వర్ణనావిషయమునను కథాసందర్భ సంఘటనమందును ఏయేప్రకారముగ నున్నవో వాటిని కొంతవరకు సంగ్రహించి తెలుపగోరితిని.

గ్రంథరచనయే కావ్యపరిచయమునకు ఫలము. అట్టిది యలవడవలయునన్న యభియోగము కావలెను. అట్టి

యభ్యాసమునకు ముఖ్యమైనది లక్ష్యలక్షణజ్ఞానము. ఇది కేవల మలంకారములకును శబ్దస్వరూపవిచారణకును ఉపయోగించుచున్నారు. ఇది కావలయును. ఇంతకన్నను ముఖ్యమైనది వాక్యముయొక్క లక్ష్య లక్షణపరిజ్ఞానము. ఇది యున్నపైని దీని కలంకారపరిజ్ఞానము వలయును. అది లేకున్నను కావ్యము మనోహరముగనే యుండును. అందుచేతనే విశిష్ట పదరచన కావ్యమునకు ప్రాణమని పెద్దలు చెప్పెదరు. వాక్యదోషహానమువలనను గుణాదానమువలనను వాక్యార్థపోషణమగుటచే కావ్యము సుందరమై మనోహరముగ నుండును. శబ్దసౌష్ఠవము గూడ ముఖ్యమే గాని ఏ శబ్దమెచ్చటనుండిన వాక్యమునకు కాంతియును ఓజస్సును గలుగునో యా శబ్ద మచ్చటనుంచి రచించినచో కావ్యసౌందర్యము పోషింపబడును. కాంతియన మనోరంజకముగ నర్థస్ఫూర్తియే. వాక్యమువలన బోధింపబడు విశేషము నిస్సంశయముగను దృఢముగను మనస్సునకు నాటించునదియే యోజస్సు. అందుచే నీ రెండును ముఖ్యమైనవి. ఇట్లుని శ్రుతికటువుగ నుండినచో కావ్య మాదరణ వడయనేరదు. సర్వజనాదరణీయమగుటకు మాధుర్య సౌకుమార్యములు కావలయును. అందుకు వలయునట్టి శబ్దము లేర్చి కూర్చవలయును. ఇది సంపాదించుటకుగాను అనుల్బణపదములు సంగ్రహించవలయునని యాలంకారికులు చెప్పుచును పదము

లేర్చి కూర్చుటవలననే యమకాదులగు శబ్దాలంకారములు గలుగునుగాని యవి ప్రఖ్యాతమని యెంచగూడదు. అర్థ గుణమే ప్రధానముగా నుండవలెను. గుణవిశిష్టమగు వాక్య రచనకు లక్ష్య లక్షణములు గ్రహించిననేగాని యాంధ్రగద్య రచన నభ్యసించుటకు సాధ్యముగాదు.

ప్రాచీనాలంకారిక గ్రంథములందు పద్యరచన లక్ష్య లక్షణసహితముగ నున్నది. గద్యరచన కవులకు నికషోపల మని ప్రాచీనాలంకారికుల యభిప్రాయమై యున్నది. 'గద్యం కవీనాం నికషం వదన్తి' అని కావ్యాలంకారసూత్రమం దున్నది. దాని వ్యాఖ్యయందు 'అనియతత్వాత్' అనివ్రాసియున్నారు. గద్యమునకు నియమము లేవియును ప్రాచీనాలంకారికులు వారి గ్రంథములందు వ్రాసియుండలేదు. కావ్యమునకు విశిష్ట పదరచనయును శబ్దార్థగుణదోషములును చెప్పియుండుటచేత నున్నా కావ్యములు పద్యాత్మకములనియును గద్యాత్మకములనియును ఉభయాత్మకములనియును విభాగించుటచే నీ త్రివిధకావ్యములకును సామాన్యలక్షణములు చెప్పియున్నా రని యూహించుట కవకాశము గలదు. గాని లక్ష్యము లను విమర్శించుచో కేవల పద్యములనే గ్రహించి వారు వ్రాయుటచే లక్ష్యమందు లక్షణసమన్వయము చేయుటలో గద్యమందు మార్గదర్శకము లా గ్రంథములు కాలేదు. అందుచే రచనాభ్యాసకునకు తగిన యాధారము లేదు. ఎందు

చేతనంటే పద్యములు ఛందోబద్ధములగుటచే వాటియందు చూపించిన రచనావిశేషములు గూడ వృత్తరూపమగువాటికి వర్తించునన్న యభిప్రాయము సంజాతమగుటకు తగిన యవకాశము గలదు. గణబద్ధముగాని గద్యములకును గణబద్ధములగు పద్యములకును గల భేదము గణబద్ధతేయన్న యభిప్రాయమనిర్వారణీయమగుచు వచ్చినది. అందుచేతను గద్యములందలి పదక్రమమును పద్యములందలి పదక్రమమును వేర్వేరుగ నుండవలయునని తోచుచున్నది. గద్యపద్యములకుగల రచనారీతి యొక్కటియే. యన్న యభిప్రాయ మదుగంటవలసివచ్చినది. గద్యమునందలి వాక్యములందు సమాపక్రియ వాక్యాంతముననే యుండవలయునన్న యభిప్రాయము ప్రబలినది. ఏపద మెచ్చోటనున్న వాక్యార్థపోషణమునకు వలయు కాంత్యోజస్సులు సమకూరునో అట్టి పదరచన గద్యమునకు గూడ వలయునన్న సూత్రము సామాన్యముగా మృతప్రాయమైనది. అందుచే గద్యరచనయందలి కష్టము మెండగుటచే నది యెకవులకు నికషోపలమైనది. క్రీ॥ పరము ఆరవశతాబ్దమువాడగు బాణభట్టు తాను రచించిన హర్షచరిత్రాదిని గద్యకావ్యములు రచించినవారు గూడ వంద్యులగు కవీశ్వరు లగుచున్నారని వ్రాసుకొనవలసివచ్చినది.

గద్యపద్యములకు గల భేదము కేవలము లయవలన గలుగుచున్నది. పద్యకావ్యమును గూర్చి చెప్పుటలో నాది

కవి యగు వాల్మీకి తానురచించిన పద్యకావ్యము తంత్రీలయ సమన్వితము అనగా గానమునకై శ్రావ్యమైనట్టి లయతో కూడుకున్నదియును అని చెప్పియున్నారు. పద్యము లన్నియును భరతశాస్త్రమందు చెప్పబడిన తాళములను వాటి గతులను అనుసరించియుండు నన్న యభిప్రాయమును వాల్మీకి వెల్లడిచేసినారు. ఇవి చూపించుట నా ముఖ్యోద్దేశముగాదు. అందుచే నీయంశము విస్తరించిచెప్పక దానిని విద్వాంసులగు బోధకులకు వదలి గద్యపద్యములందలి వాక్యరచన యొకే రీతిగ నున్నదా లేక భిన్నమార్గముల నవలంబించినదా యన్న విషయమున కవిత్రయము వారి ప్రయోగములను చూపించుటయే ముఖ్యోద్దేశము. ఇదియే గద్య రచనాభ్యాసమునకు సహకారిగ నుండును. ఈ విషయమున గొన్ని ప్రయోగముల నిందు జూపుచున్నాను.

నన్నయ రచించిన యీ క్రింది పద్యమును జూడుడు.

ధనపతుల బాలతులు ముద
మున బాలు ద్రావబోయిన నన్మ
త్తనయుండు వీఁడు బాల్యం
బున నేడ్చుచు బాలు తనకు బోయుండనుచున్.

ఈ వాక్యమునందలి సమాపక క్రియ వాక్యాంతమున నుంచలేదు. దానివలన వాక్యమున కేమి శోభ గలిగినదో విచారింతము.

తన తనయునికి త్రాగుటకుఁ బాలు కావలెనని చెప్పుటయే ముఖ్యోద్దేశము. అది మనస్సున నాటుటకుగాను పాలు కావలెనన్న శబ్దసమూహము వాక్యముచివర నున్నచో కార్యకారి యగునన్న నియమమును సూచించుచున్నది. వాక్యాదిని గాని వాక్యాంతమునను గాని శ్రోతల మనస్సు నిలుచును. అట్టిచోట్లనే యభిప్రాయమును వెల్లడిచేయు పదములు గాని పదసమూహములు గాని యుండవలయును.

పై పద్యమందలి వాక్యమునే ఈ క్రింది విధముగ వ్రాసి చూతము.

ధనపతుఁ బాలకుండు సుతసుతుఁ బాలు ద్రావబోయిన నస్మత్తనయుండు వీఁడు బాలు తనకు బోయుండంచున్ బాల్యంబున నేడ్చెను.

ఈ వాక్యమువలన ముఖ్యముగ బోధింపబడు విషయము బాలు దేవ్పుటయే. శ్రోతల మనస్సుల నిలుచు విషయము గూడ నదియే. అందువల్లను బోధనీయార్థభేదము పదవిన్యాస భేదముచే నెట్లు గలుగుచున్నదో జూడవచ్చును.

ఇందు మొట్టమొదటిక్రమమున నున్నది పద్యక్రమ మనియును రెండవది వచనరచనాక్రమ మనియును చెప్పినచో నెట్టి యసందర్భము గలుగుచున్నదో చూడవచ్చును. సమాపకక్రియా స్థలభేదముచే శ్రోతల మనస్సులయం దెట్టిభేదము పుట్టునో చూచితిరా! ప్రధానముగ తెలియజేయవలసిన యం

శము పోలు గావలయునదియే. అది యొక వాక్యమున నంత మందుండి తానే ప్రధానవిషయమని శ్రోతకు తెలియజేయును. రెండవవాక్యములో వాక్యముఖ్యమందుండి తానే ప్రధానవిష యమనని శ్రోతల మనస్సున నాటనేరదు. వాక్యమందలి స్థలములలో వాక్యాంతము ప్రధానస్థలమనియును ముఖ్యముగ గమనింపవలసిన విషయము నచ్చట నుండిన సుగ్రాహ్యమగునని యును తెలియవచ్చును. ఇటులనే వాక్యాదికూడ నొక ప్రధానస్థలమే. వాక్యముఖ్యమున నున్న విషయము శ్రోతల నాకర్షింపనేరదు.

ఇట్టి విశేషముండుటచేతనే వాక్యరచనాలక్షణములు కావ్యసామాన్యములే గాని గద్యమున కొకటియు పద్యమున కొకటియు నుండనేరదు.

ఈ క్రింది తిక్కనపద్యములను చూతము.

నీరిలోన దోచు తారకప్రతిబింబ
మొక్కటియనగ వెలుగుచున్నదాని
రాచకొడుకులెల్ల జూచుచునుండిరి
దాని బుచ్చుకొను విధంబులేక.

ఈ వాక్యమున ప్రధానముగ జెప్పవలసిన విషయము రాచకుమారులకు తెలియదనియేగాని వారు చూచుచుండిరని చెప్పుటగాదు. చూచుచుండుట యప్రధానము. విధము లేమి ముఖ్యము. అందుచే దానిని వాక్యాంతమందుంచినాడు గాని

ఛందోనిర్బంధము వలన గాదు. చూచుచు నుండిరను సమాపక క్రియను వాక్యాంతమందుంచి వ్రాయుట కవకాశము గూడ లేదని తెలియుచున్నది. కర్త రాచకొడుకులు. కర్మ నీరిలోన దోచు తారకప్రతిబింబ మొక్కొ యనగ వెలుగుచున్నదాని. క్రియ జూచుచునుండిరి. విశేషము దాని బుచ్చుకొను విధంబులేక. విశేషణము చూచుచుండుటకు కారణమైనది. చూచుచున్న వస్తువు కందుకము. ఈ రెండిటికిని వాక్యాది వాక్యాంతములను వదలిపెట్టినాడు కవి. రాచకొడుకులు చూచుచుండిరి అను వాక్యభాగమును వాక్యమధ్యమున నుంచినాడు.

గద్యక్రమమును సామాన్యముగ నెన్నబడురీతిని ఆ వాక్యమును వ్రాయుదము.

రాచకొడుకులు నీరిలోన దోచు తారక ప్రతిబింబ మొక్కొ యనగ వెలుగుచున్నదాని దాని బుచ్చుకొను విధంబులేక జూచుచునుండిరి.

'దానిబుచ్చుకొను విధంబులేక' యన్న పదసమూహము కర్మను చెప్పినపిమ్మట రావలయునేగాని పూర్వము రానేరదు. ఈ విశేషము దాని యను సర్వనామపదప్రయోగముచే వెల్లడియగును. అందుచే పైనివ్రాసినవిధముననే వ్రాయవలయును. అట్లు వ్రాయబడిన వాక్య మెంత వెలితిగానున్నదియును స్పష్టమగుచున్నది.

దాని యను సర్వనామము రెండు పర్యాయములు వాడినారు. అందొకటి విడిచి వాక్యమును వ్రాసిచూతము.

రాచకొడుకులు నీరిలోనదోచు తారక ప్రతిబింబ మొక్కటియనగ వెలుగుచున్నదాని బుచ్చుకొను విధంబులేక జూచుచునుండిరి.

చూచుచునుండిరి అనునది సకర్మకక్రియ. పై వాక్య మున 'దాని' యను పదమును విడుచుటచే కర్మ లోపించి నది. అందుచే వాక్యమే చెడిపోయినది. ఒకటి పదమునైనను విడుచుట కవకాశము లేదు.

తిక్కన వాక్యరచన జూచినను వాక్యాది వాక్యాంత ములయందున్న పద పద సమూహములే ప్రధానముగా మన స్సున నాటునని తోచకమానదు. మిక్కిలి బలహీనమగు భాగము వాక్యమధ్యమే యగుచున్నది.

తిక్కనది మరియొక వాక్యమును చూచెదముగాక.

పరమ గురూపదేశమున పార్థుడు పార్థివరత్న శేఖరుం డరిది తపంబునన్ భుజబలాతిశయంబున నీశుఁ బన్నగాభరణుఁ బ్రసన్నుజేసి దయఁ బాశుపతాదిక దివ్యబాణముల్ హర సుర రాజదేవ నివహంబులచే బడసెన్ బ్రియంబుగన్.

ఇందలి పదములను వాటివాటి స్థలములు మార్చినచో వాక్యము చెడిపోవునని తప్పక తెలియవచ్చును. వాక్యమున పదక్రమమును మార్చి యనేకవిధముల వ్రాయవచ్చును.

పార్థుడు పార్థివరత్నశేఖరుడు బడసెన్ అనునది ముఖ్య వాక్యము. పొందినవాడు పార్థుడని చెప్పుటయే ముఖ్యము

గనుక పార్థుఁడను పదము ముందుంచినవాడు. తరువాతను పార్థుని విశేషణమైన పార్థివరత్నశేఖరుడను పదము నుంచెను. ఈ రెండువాక్యములకును భేదము చూచుడు.

పార్థుడు పార్థివరత్నశేఖరుడు పడసెను
పార్థివరత్నశేఖరుడు పార్థుడు పడసెను.

పడయుటకు సాధనములు మూడని చెప్పినాడు. అవి పరమగురూపదేశము, అతిదితపము, భుజబలాతిశయము. ఇందు గురూపదేశము ముఖ్యము. రెండవది స్వప్రయత్నము. అందు ప్రసన్నతకు కారణములలో భుజబలాతిశయము ప్రధానము. ఇట్టి ప్రీతిసాధనములు మూటియందును సర్వప్రధానము గురూపదేశమని చెప్పుటకే ప్రప్రథమమున పరమగురూపదేశమున అని చెప్పినాడు. ఇదిగాక పార్థుని తపస్సు చేయుటకు వెళ్లుమని చెప్పినది గురూపదేశము. అందుచే వాక్యాదిని పరమగురూపదేశమున అని చెప్పినాడు. ఈ వాక్యమందలి యంశములు సక్రమముగనే చెప్పబడినవి. స్థల నిర్దేశము క్రమము నాశ్రయించి యున్నదని చెప్పనొప్పును. ఎఱ్ఱాప్రగడ రచించిన యీ క్రిందిపద్యమును చూచెదము.

కొలకులవాగులన్ నదులఁ గోవుల బావుల నిర్ఝరంబులన్
గలయఁగ రోసి రోసి వడి గప్పలగుప్పలుగా వధించు-చో
నలుగులమందు భేక నివహంబు గనుంగొని భేకనాయకుం
డలఘు తపస్విరూపమున నా నృపుపాలికి వచ్చియిట్లనున్.

ఇందలి పదసమూహాక్రమము విషయక్రమము ననుసరించియున్నది. ఈ వాక్యసముదాయమందలి సమూహక్రియ

వాక్యాంతమున నేయున్నది. విషయములయందు ముఖ్యమైనది యును క్రమమున చివరదియు నగుటచే వాక్యాంతమున వచ్చుటయే మంచిది. కార్యక్రమము ననుసరించుటయే ముఖ్యనియమముగాదు. క్రమమున నెచ్చటవచ్చినను ఏవిషయమును గ్రహించుటకు శ్రోతల కాతురముగలుగునో దానినే మొట్ట మొదటనుంచుట గూడ కొన్నిచోట్ల ముఖ్యమగుచున్నది. సీతను వెదకుటకు వెళ్లిన హనుమంతుడు చేసిన కార్యములలో సీతను చూచుట మధ్యను వచ్చినను రామునితో వార్తలు చెప్పినపుడు కంటిని అని మున్ముందుచెప్పినాడు. ఇట్టిదియే లోకమున వ్యవహారమందు గూడ గలదు. 'చూస్తాను నేన క్కడికివెళ్లి' అని ప్రసంగమున జనులాడెదరు.

వాక్యరచనావిషయములగొన్నిటి నుదహరించితిని. కవిత్రయమువారి పద్యములను గద్యములనుబట్టి వాక్యగుణముల నన్నిటిని జూచుచు పఠించినచో మంచి శైలి యలవడును. ఇదియునుగాక ప్రాచీనకాలముననుండిన రచనాపద్ధతులు గ్రహింపనగును. పాశ్చాత్యభాషలలో నున్న నవీనాలంకారిక మతమును దెలియజేయు గ్రంథములను చూచినచో మన ప్రాచీనుల రచనాపద్ధతికిని దానికినిగల భేదము తెలియనగును. ఆధునికగ్రంథపరిచయము గూడ గద్యరచన కవసరమే గాని ప్రాచీనపద్ధతులయొక్క మంచిచెడ్డలు గూడ గ్రహించుట యావశ్యకమే.

మరియొకమాట. నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ లను కవిత్రయమందురు. వీరు ముగ్గురును ఒకకాలమువారు

కారు. నన్నయ తిక్కన లొకవేళ సమకాలికులు కావచ్చును. లేదా వారికి నడుమనున్న కాలము నలుబది యేబది సంవత్సరములకు మించియుండనోపదు. నన్నయార్థ ప్రాధాన్యమును గణించినాడు. తిక్కన శబ్దమును అర్థమును గూడ వలయునని చెప్పినవాడు. ఎఱ్ఱాప్రగడ నన్నయభట్టు తిక్కకవినాథులు చూపిన త్రోవపావనంబని యెంచి దాని నవలంబించినవాడు. ఈ ముమ్మరును భారతము నాంధ్రమున రచించినవారు. ఇందు నన్నయభట్టారక కవియునియును తిక్కన కవిబ్రహ్మయని యును పేరుపొందెను. ఎఱ్ఱాప్రగడను ప్రబంధ పరమేశ్వరు డందురు. వీరి శైలిసంస్కృతిపదభూయిష్టమై యుండును. నన్నయభట్టారకుని శైలిలో కథాసందర్భములు తెనుగుపద బాహుళ్యమునువర్ణనాంశములు సంస్కృతపద బాహుళ్యమును గలిగియుండును. తిక్కనసోమయాజి శైలియం దౌచిత్యాను సారముగ నుభయభాషాపదములునుగలవు. మొత్తముమీద తెలుగుపదము లధికముగ నుండునని తోచును. ఈ విషయము గూడ నీవనమాల చదివినవారు గ్రహింపగలరు. ఇదిగాక కథాసందర్భములందును వర్ణనలయందును కవిత్రయము వారికినిగల యంతరము బోధపడుట కవకాశముగలదు. ఆంధ్రసారస్వతమును దానియందలి రీతులను గ్రహించుట కవకాశమిచ్చుటకు నేసేకరించినది. గద్యభాగముల వాక్యాంత ముల విరామములుంచి వాక్యస్వరూపమును విభజించి చూపించితిని. దీనిచివరను శబ్దార్థసూచి యొకటి చేర్చితిని. రచనాభ్యాసమునిమిత్తము కొన్ని విషయము లిచ్చితిని.

గా॥ నరసింగరావు

# తప్పొప్పుల పట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 21 | చెప్పుమును | చెప్పుమాతు |
| 4 | 1 | చందోబద్ధము | ఛందోబద్ధము |
| 7 | 4 | యమునని | యమని |
| 21 | 4 | శ్రేయాగ్ల | శ్రేయసః |
| 24 | 2 | నేయనోప మహా యమని | నేయనోప ప్రహాయ మని |
| 25 | 15 | నంజదధ్వనియు | నంబుదధ్వనియు |
| 28 | 12 | బారియ | బారయ |
| 29 | 1 | దేవుండు | దేహుండు |
| 30 | 21 | పండ్రం | పండ్రాం |
| 34 | 15 | దానితీరంబు | దానితీరంబున- |
| 40 | 7 | గానిపినిచి | గానిపించి |
| 41 | 6 | మనోభవుంబు | మనోభవుండు |
| 47 | 10 | అకులత | ఆకులత |
| 51 | 20 | ఘనభుజ | ఘనభుజా |
| 76 | 16 | స్త్రుంబై | స్రంబై |
| 77 | 11 | బొత్తెంచి | ఝొత్తెంచి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 94 | 2 | శూరుల్ | శూరులు |
| 95 | 3 | ఆతనిఁ | ఆతనిఁ |
| 99 | 11 | ముమ్మొయి | మొమ్మొయి |
| 99 | 16 | దంబార | ధంబార |
| 102 | 18 | రొసగి | యొసగి |
| 106 | 6 | నెకా | నేకా |
| 106 | 9 | చిత్రంబె | చిత్రంబు |



శ్రీ

# వనమాల

## ప్రథమభాగము

## 1. కచుని చరిత్ర

క. మనుజాధిప వృషపర్వుం
డను దానవపతికి శుక్రుఁ డాచార్యుండై
యనిమిషవిరోధులకుఁ బ్రియ
మొనరించుచు వివిధవిధి నయోపాయములన్. 1

క. దేవాసురరణమున గత
జీవితులగు నసురవరులఁ జెచ్చెర మృతసం
జీవని యను విద్యఁ బున
ర్జీవులఁగాఁ బ్రతిదినంబుఁ జేయుచునుండెన్. 2

దాని నెఱింగి దేవతలెల్ల నతిభీతులై యసురుల నోర్వ నోపక శుక్రువలన మృతసంజీవని వడసి తేనోపునట్టి మహాసత్త్వం డెవ్వండగునో యని విచారించి బృహస్పతిపుత్త్రుం డయిన కచుని కడకుం జని యిట్లనిరి:—

క. పోరున మృతసంజీవని
కారణమున నిహతులయ్యుఁ గారసురవరుల్
వారల నోర్వఁగ మనకతి
భారము దుర్వారవీర్యబలయుతు లగుటన్. 3

క. మనపక్షంబున వార
ద్దనుజులచే నిహతులయ్యుఁ దగ మృతసంజీ
వని లేమిఁజేసి శమను స
దనమున కరుగుదురు వీర్యదర్పితులయ్యున్. 4

క. కావున మృతసంజీవనిఁ
దేవలయును శుక్రువలన ధృతిఁబడసి తప
శ్శ్రీవిభవ దానిబలమునఁ
గావంగా వలయు సురనికాయబలంబున్. 5

క. బాలుండవు నియమవ్రత
శీలుండవు నిన్నుఁ బ్రీతిఁజేకొని తద్వి
ద్యాలలనాదానముఁ గరు
ణాలయుఁడై చేయు నమ్మహామునినీకున్. 6

దుహితృస్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుం డతిక్రమింపండు గావున నీ నేర్పువిధంబున దాని చిత్తంబువడసి శుక్రు నారాధించిన నీ కిష్టసిద్ధియగునని దేవతలు ప్రార్థించి పంచినం గచుండును దేవహితార్థంబు వృష

పర్వపురంబునకుం జని యచ్చట వేదాధ్యయనశీలుండయి సకలదానవగణోపాధ్యాయుండయి యున్న శుక్రుంగని నమస్కరించి యిట్లనియె:—

క. ఏను గచుండనువాఁడ మ
హానియమ సమన్వితుఁడ బృహస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును
భానునిభా శిష్యవృత్తి బని సేయంగన్. 7

అనిన నమ్మునికుమారుని సుకుమారత్వంబును, వినయ ప్రియవచన మృదుమధురత్వంబును, ననవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబునుంజూచి శుక్రుం డతి స్నేహంబున, వీనిం బూజించిన బృహస్పతిం బూజించిన యట్లయని యభ్యాగతపూజల వాని సంతుష్టుంగాఁజేసి శిష్యుంగాఁ జేసికొని యున్నంత నక్కచుండు,

సీ. పనియేమి పంచినఁ బదపడి చేసెద
ననక తత్క్షణమున యాజ్ఞ దలఁబ
చేయుచు నిజగురు చిత్తవృత్తికిఁ గడు
ననుకూలుఁడై వినయంబుతోడ
మనమునఁ, జెయ్వుల, మాటల, భక్తి నే
కాకారుఁడై మఱి యంతకంటె
దేవయానికి సువిధేయుఁడై ప్రియహిత
భాషణములఁ బ[illegible]ఫలపుష్పసేవ

ఆ. దానవులను సంతతప్రీతిఁ జేయుచు
నవ్విధమునఁ బెక్కులేండ్లు నిష్ఠ
గురుని గురుతనూజఁ గొలిచి యయ్యిరువుర
నెమ్మి వడసెఁ దనదు నేర్పు పేర్మి. 8

ఇట్లు గురుశుశ్రూషాకౌశలంబునం గచుండు శుక్రునకుం బ్రియశిష్యుండై యున్న నెఱింగి దానవులు సహింపనోపక బృహస్పతితోడి వైరంబున నక్కచు నొక్కనాఁడు హోమధేనువులం గాచుచు వనంబున నేకతంబ యున్నవాని వధియించి విశాలసాలస్కంధంబున బంధించి చనిరంత నాదిత్యుం డస్తశిఖరగతుండగుడు మగిడి హోమధేనువు లింటికి వచ్చిన వానితోడన కచుండు రాకున్న దేవయాని దన మనంబున మలమల మఱుంగుచుం బోయి తండ్రి కిట్లనియె:—

ఉ. వాడిమయూఖముల్ గలుగు
వాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁ డిటవచ్చె నేకతము
నిష్టమెయిన్ భవదగ్నిహోత్రముల్
వోఁడిగ వేల్వఁగాఁ బడియె
బ్రొద్దును బోయెఁ గచుండదేమొకో
రాఁడు వనంబులోన మృగ
రాక్షస పన్నగ బాధ నొందెనో. 9

అనిన విని శుక్రుండు దన దివ్యదృష్టిం జూచి యసుర వ్యాపాదితుండైన కచుం గని వానిం దోడ్కొని తేర మృత సంజీవనిం బంచిన నదియును బ్రసాదం బని యతి త్వరితగతిం జని విగతజీవుండయిన కచు నప్పుడ సంజీవితుం జేసి తోడ్కొని వచ్చినం జూచి శుక్రుండును దేవయానియు సంతసిల్లి యున్నంతఁ గొన్ని దినంబులకు వెండియు నొక్కనాఁడు,

క. అడవికిఁ బువ్వులు దేరఁగ
వడి నరిగిన కచునిఁ జంపి వానిని దనుజుల్
పొడవు సెడఁ గాల్చి సురతోఁ
దడయక యబ్బూది శుక్రుఁ ద్రావించి రొగిన్. 10

శుక్రుండును సురాపాన మోహితుండయి యున్నఁ దొల్లింటియట్ల దేవయాని కచుంగానక దుఃఖితయై నేఁడునుఁ గచుండు రాక మసలె నసురులచేత నిహతుండయ్యెం గావలయు నని శోకించిన దానిం జూచి శుక్రుం డిట్లనియె:—

క. వగవక సంజీవని పెం
పగణిత గర్వమున నసురు లా కచుతోడం
బగఁ గొని చంపెద రాతఁడు
సుగతికిఁ జనుఁ గాక యేల శోకింపంగన్. 11

అనిన దేవయాని యిట్లనియె:—

మ. మతిలోకోత్తరుఁ డైన యంగిరసు మ
న్మం డాశ్రితుం డాబృహ

స్పతికిం బుత్త్రుఁడు మీకు శిష్యుఁడు సురూ
పబ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ డకారణంబ దనుజ
వ్యాపాదితుం డైన న
చ్యుతధర్మజ్ఞు మహాత్ము నక్కచున కే
శోకింప కెట్లుండుదునే. 12

వానిం జూచికాని కుడువ నొల్లనని దేవయాని యేడ్చుచున్నఁ బెద్దయుం బ్రొద్దునకుఁ బ్రసన్నుండయి శుక్రుండు దన యోగదృష్టిం జూచి లోకాలోక పర్యంత భువనాంతరంబునఁ గచుం గానక సురాపానవిభ్రమభ్రష్టమానసుండయ్యును తన యుదరంబున నున్న యక్కచుం గని సుర సేసిన దోషంబును నసురులవలన నైన యపకారంబును నెఱింగి,

ఆ. మొదలి పెక్కు జన్మములఁ బుణ్యకర్మముల్
వరలఁ బెక్కు సేసి పడయఁ బడిన
యట్టి యెఱుక జనుల కాక్షణమాత్రన
చెఱుచు మద్యసేవ సేయ నగునె. 13

క. భూసురులాదిగఁగల జను
లీసుర సేవించిరేని నిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితులగుదురు
చేసితి మర్యాద దీనిఁ జేకొనుఁడు జనుల్. 14

—నన్నయభట్టు

# 2. చిరకారిత



క. త్వరితము సేయక కార్యము
చిరంతన విమర్శనముగఁ జేసి యొనర్పన్
ధరణీశ్వర! యోటువడఁడు
బురుషుఁడు సిద్ధియును వానిఁ బొందు దృఢముగన్. 1

క. తాలిమి లేని జనంబులు
మేలెఱుఁగక యట్టివారి మీఁదను జాడ్యం
బాలస్యం బిదియని దో
షాలోచన మాచరింతు రది మతియగునే. 2

అని వెండియు నిట్లనియె. నీయడిగిన యర్థంబు మేధాతిథి యను మునిసుతుండు చిరకారి యనువాఁడు వాని వృత్తంబు వినినం దెలియు దానిం జెప్పెద.

క. అతఁడు చిరకాల సువిచా
రితంబుగాఁ జేసి యాచరించుం గురుభూ
పతివర్య యెద్దియును నది
కతముగఁ జిరకారి నామకంబున బరఁగున్. 3

సీ. విను మొక్క కారణంబున మునిపత్నిపైఁ
గోపించి చంప నక్కొడుకుఁ బనిచి.

మొటయేని వెడలిపోవుటయును బనులెల్లఁ
జరవిచారముతోడఁ జేయుఁగాన
నచ్చిరకారి యిట్లని విచారించె జ
నకు పన్పుసేఁత మానంగరాదు
తల్లిఁ జంపుటయును దగదు తండ్రి తలపు
తప్పింతుఁ గాకని తలఁతునేని

గీ. గల్గునుం బాప్రము దాని సత్కర్మవిదులు
మాతృరక్షకర్తవ్య మేమాడ్కినైనఁ
బుత్రభావమస్వాతంత్ర్యమునకు నెలవు
పాపముడఁగింప నెవ్వలనోపునొక్కొ. 4

క. జననీవధంబుచేసిన
ననుమానమె నరకమగుట యని యుడిగితిఁబో
జనకావమాన మొనరిం
చినవానికి నరకమున వసింపఁగ వలదే. 5

గీ. తల్లి ధాత్రిగ బీజంబు తండ్రి వెట్టు
వంశధరణార్థముగ నిధివారిభంగి
యేనుఁబొత్తులవాఁడ నయ్యిరువురకును
వీరలందిప్పు డెవ్వరి విడుచువాఁడ. 6

అని విచారించి తలంచుకొని,

క. జనకుఁడయేనై జన్మిం
చినవాఁడను జనకుపంపు జేసినఁ బాయుం

దనయుని పాపములనియే
వినియుండుమఁ దలఁపులింక వేయును నేలా. 7

క. జనకుఁడు తపమును ధర్మం
బును విద్యయుఁ బరమదైవమును గావున నా
తనికి బ్రియంబగు పని చే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁజెందుటగల్గుౝ. 8

అని వితర్కించి తల్లి తెఱంగుఁ దలంచి,

చ. కరచరణాది సంఘటిత
కాయము సంజననంబువహ్ని పు
ట్టరణియుఁబోలెఁ దల్లి దెస
నై నదిగాదొకో యట్లుఁగాక దు
ర్భరమగు గర్భఖేదమును
బట్టికినై నిజదేహచింతపై
భరమొకయింతలేక పడు
పాటులు నక్కట యెక్కుడెంతయుౝ. 9

ఆ. వె. వచ్చిపోయిచూచువాఁడుగా కిడుములఁ
బడును తల్లివోలెఁ బట్టితోఁడ
దండ్రిసెప్పు నిట్లు ధర్మశాస్త్రంబులు
నంబ గౌరవమున నధికయగుట. 10

ఆ. వె. బాలుఁడైనఁగొడుకు ప్రౌఢుడైనను వృద్ధుఁ
డైన నొక్కవిధము యర్మిలియును

నరయు భరము తల్లి కా పదార్థంబు జ
గంబు కలిమికెల్లఁ గారణంబు. 11

ఆ. వె. క్షుద్రజంతువులకు సురలకు నెమ్మెయిఁ
దలఁప నొక్కరూప తల్లివలయు
నూఱడిల్లఁగలదె యొండుచోటను సువ
స్తువు నివాసమైనచోటఁగాక. 12

క. అప్పుడ యసమర్థుండగు
నప్పుడ దుఃఖియగు శూన్యమై తోఁచుజగం
బప్పుడ మాతృవియోగం
బెప్పుడు వాటిల్లునపుడ యెంతయుఁదూలున్. 13

క. కలవాఁడు లేనివాఁడును
బలుఁ డబలుఁడు మూఢబుద్ధి ప్రౌఢుండనఁగా
వలదెవ్వరికైన జనని
కలిమియ యత్యంతసౌఖ్యకరమై యుండున్. 14

గీ. ఇట్టి జనని వధించుట యెల్లభంగి
నధిక పాపపయోరాశియందు ముంచు
దీనినెఱుఁగఁడె పసులవాఁడైన వధకు
నేల తెంపువాటిలుఁ జేతు లెట్టులాడు. 15

అని యిట్లు పెక్కుభంగుల నూహించుచుఁ జిరకారి యగుట నతండు శీఘ్రకారిగాక యుండం దడ వెంతయేనియుం గలిగె నంతకుం దదీయజనకుండు,

క. వెడపనికి నాలిఁజంపం
గొడుకుఁబనిచి వచ్చినాఁడఁ గ్రూరత్వమునం
గడువంబడునొకో పనియని
కడువెసఁ జనుదెంచె నశ్రుకణములు దొరుగన్. 16

అట్లు చనుదెంచునప్పుడు,

క. చిరకారియొట్లునుం దన
చిరకారితఁ జూపుగాక శీఘ్రపు సేఁతన్
దురటిల్లఁజేయునే, నను
వెరవరి, వాఁడిట్టిపనికి వేఁగిరఁపడునే. 17

అని పుత్రు నుద్దేశించి,

చ. చిరముగ గర్భవాసమునఁ
జెందితి పుత్రచిరంబుఁగాఁగ ని
న్నరసెఁగదయ్య తల్లి యన
యంబును నేఁ బనుపంగఁబూనియుం
జిరముగ నిట్టు లిత్తెఱఁగు
చేఁతదలంచితయేని సత్కృపా
పరచిరకారినాఁ బరగు
భాసితనామము సార్థకంబగున్ 18

ఆ. వె. నాకు నా తపంబునకు నిందరాకుండఁ
దురితభయము నిన్నుఁ బొరయకుండఁ

నేమిఁజేసితన్న నీ చిరకారిత
సకలభూతములును సంస్తుతింప. 19

అనుచుం జనుదెంచి నివాసంబు ప్రవేశంబుచేసినం గని చిరకారి కరంబుననున్న వధసాధనంబుఁ డిగ్గవిడిచి యగ్గౌతమ వంశవర్యు చరణంబులు శిరంబుసోఁక దండప్రణామంబుసేసెం బత్నియు సాగిలి మ్రొక్కె నయ్యెరువుర నెత్తి శోకబాష్పంబు లానందాశ్రువులుగా నమ్మునివరుండు దనయుని గాఢాలింగనంబును మూర్ధఘ్రాణంబునుం జేసి దీవనలం బొగడ్తల నభినందించి తానును వారును సుఖాసీనులయి యుండి మఱియు నిట్లనియె.

క. కార్యవిచారము చిరముగ
ధైర్యముతో నడుపవలయుఁ దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁడని
యార్యులు చేయుదురు నిశ్చయంబు చిరముగన్. 20

క. మిత్రత్వము శత్రుత్వముఁ
బాత్రతయు నపాత్రతయునుఁ బరికించు సుచా
రిత్రుఁడు చిరతర గణనా
సూత్రితముగ దానవెల్ల శుభములుపొందున్. 21

అని నిర్దేశించె నట్లా చిరకారి చిరకారిత్వంబు సఫలంబు నొంది వినుతిఁబొందె.

క. కావునఁ గురువంశోత్తమ
నీవును సదసత్ప్రకార నిశ్చయము చిరం
బై వరలంజేయు మీ యది
గావించుఁ జిరములయిన కార్యఫలములన్. 22

క. విను మచిరవృత్తిఁ జేసిన
పని కర్తకు నావహించుఁ బశ్చాత్తాపం
బనఘా చిరభావిత శు
ద్ధి నిరూపణకృతము శుభముఁ దేజముఁ దెచ్చున్. 23

—తిక్కన సోమయాజి

# 3. బోయ-కపోతము



సీ. పాపాత్ముఁ డొక బోయ పక్షుల వధియించి
తినియును బెక్కమ్మికొనియు నదియె
బ్రదుకుగా దానికి బహు సాధనంబులు
సవరించుకొని మహాటవిఁ జరింప
నొకనాఁడు పెనువానయును గాలియును ముట్టి
సకలజీవులకు నాశంబు పుట్టు
నట్టిదమై కానయంతయు జలమయ
మైన బెగ్గిలి యున్నరాధముండు

గీ. వేఁగ వఱ్ఱొడ్డి యల్లన వెడలి మిఱుత
నొక వనస్పతి జొంపమై యున్న దానిఁ
జెంది రాతిరి యగుటయు శిలయ సెజ్జ
గాఁగ శీతార్తుఁడై యుండెఁ గౌరవేంద్ర. 1

క. ఆలుబ్ధకుఁ డా తరువర
మాలోకించి కడు భక్తి ననియె నిచటి భూ
తాలింగొలిచెదఁ గరుణా
శీలత ననుఁ గాచుటకు విశిష్టవినీతిన్. 2

అని యిట్లప్పక్షిధ్వంసకుండు శయనంబుఁ బ్రాపించి యుండ నమ్మహీరుహంబు కోటరంబున వసియించి యుండు

నది యొక్క కపోతంబు తనవల్లభ యెటయేని మేఁతకుంబోయి రాక తడసిన శోకించి,

సీ. ఎచట నున్నదియొక్కొ యింతప్రొద్దాకచోట
నుండునే ననుఁబాసి యుజ్జ్వలాంగి
యేకారణంబున నేమయ్యెనో వాన
మేపునఁ దెగియగా నోపుసకట
యమ్మేను లేకున్న నిమ్మేనికలిమి ని
రర్థక మధికానురాగ యుక్త
యగు సతిగుణముల నైహికాముష్మిక
సుఖసాధనంబులు సువ్రతికి

గీ. నేమిచేయుదు మందిర మిపుడు పాడు
వాఱుచున్నది యనఁగ నప్పలుకులెల్ల
బోయవలలోన నున్న కపోతి విని మ
నంబు సంతోషపూర మగ్నంబుగాఁగ. 3

క. పతిమదికి నింత యెక్కిన
యతివగదా పుణ్యవతి ప్రియాలాపము లీ
గతి వినగాంచితి జన్మము
కృతకృత్యంబయ్యె నాకు గెలిచితి జమునిన్. 4

అని యుల్లంబుననుగ్గడించి పతికిం దన తెఱంగెఱింగించి విధికృతంబునకు వగవం బని లేదని మఱియు నిట్లనియె.

చ. శరణము సొచ్చినం దగఁ బ్ర
సన్నతఁ గైకొని రక్షణంబు సా
దరమునఁ జేయ సత్యధిక
ధర్మముగా బుధకోటిసెప్పు నీ
వరసి మహాత్ము వీని శర
ణాగతు నోపినభంగి నాపదం
బొరయకయుండ జేయుము ప్ర
భూతపుసీతునఁ గొంకువోయెడున్. 5

క. అని యుల్లేర్పడఁ బలికిన
విని శోకముడిగ్గవిడిచి విహగము కరుణం
దనజాతిసెప్పి తగ ని
ట్లనియె మనుజభాషణముల నాలుబ్ధకుతోఁ. 6

క. ఓయన్న దస్సినాఁడవు
మాయింటికి నతిథివైతి మసలకనీకుం
జేయవలయు నాతిథ్యం
బేయది భవదీప్సితార్థ మెఱిఁగింపు తగన్. 7

చ. అనవుఁడు నుల్లమొంతయుఁ బ్రి
యంబు వహింపఁగఁ బక్షివర్య సీ
తున సకలాంగకంబులు బ్ర
తున్నతము లయ్యెఁడు దీనిఁ బాపవే

యనిన విహంగమంబు రయ
మారగ నచ్చటి పుల్లలెల్ల ము
క్కునఁ గొనివచ్చి ప్రోవిడి య
కుంఠితమైన దయాగుణంబునన్. 8

పొంతపల్లియకు రయంబునం జని పుల్లతలసంగతం
బైన యింగలంబు,

క. కొనివచ్చి పుల్ల ప్రోవునఁ
దనుకంగాఁ జేసి నెమ్మి దళుకొత్తఁగ ని
ట్లను బోయతోడ మే నీ
యనలంబునఁ గాఁచికొనుటకై లెమ్మనఘా. 9

చ. అనవుఁడు వాఁడు గువ్వ హృద
యం బలరం దనయంగకంబు ల
య్యనల శిఖాకలాపమున
నల్లన యల్లన సీతుగాచి శీతబా
ధన ముడుగంగఁ జేయఁగ బ
డంపడి యాఁకలి చాలఁ డోఁచె డోఁ
చిన నెఱిగించె గువ్వకది
సేయు నుపాయములేక యాత్మలోన్. 10

వగచి వెలవెలంబాఱి తలవంచి వాని కిట్లనియె.

గీ. ఖగములకు జీవనంబనఁగలదె సంగ్ర
హించినట్టిది యాఁకలి కేమిదైన

మాకుదొరఁకొన్న దిందుముగాకవైన
నీవు డస్సితి వాతిథ్యనియతివలయు. 11

నా శరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము.

క. అని పలికి యగ్ని వలగొని
తన దేహం బందులోనఁ దడయక యిడినం
గని బోయ విస్మయంబున
మనమానఁగఁ గొంతసేపు ప్రమాన్పడియుండెన్. 12

పదంపడి,

మ. కలదే యిమ్మెయి పౌరుషంబు జగతిం
గారుణ్యమేపార ని
ప్పులుఁగిట్టిచ్చెనె మేను నాదు చరితం
బుల్నిందకుం బట్టులై
తలఁపన్వచ్చిన నింతకీడగునొ యే
తత్కాంతారతా ఘోరచే
ష్టలు మానంగలవాఁడఁ బక్షిగురువై
సంధించె సద్బోధముల్. 13

అని యంతరంగంబు వైరాగ్యనిరంతరం బగుటయు
నంత నిలువక,

మ. ఇది యిట్లాలిని బంధులందొరఁగి తా
నీ యగ్నిలోఁగూల నొ

ప్పిదమై యుండఁగ నిట్టితెంపు వెలయం
బెంపార వైరాగ్య సం
పద పాపంబుల నెల్లఁ ద్రుంపఁగ మహా
ప్రస్థాన పుణ్యాత్వమొం
డెద నే నిప్పుడయంచు మానసము శాం
తింబొంది నిర్మోహుఁడై. 14

క. వలలోననున్న పులుఁగుల
వెలువడఁగా విడిచి వలయు వెండియుఁ దనకుం
గల పక్షినిహతి సాధన
ములు నచటనెయుండఁబోమె బోయనియతుఁడై. 15

—తిక్కన సోమయాజి

# 4. శిబిచరిత్ర



ఔశీనరుండు శిబియనువాఁడు భృగుతుంగం బను పర్వతంబునఁ దొల్లి యజ్ఞంబుసేయుచున్న నింద్రాగ్నులు వాని మహాగుణంబు లెఱుంగ వేఁడి యింద్రుండు శ్యేనంబైన నగ్ని కపోతంబై శ్యేనభయంబునఁ గపోతంబు పఱతెంచి శిబి మఱువు సొచ్చిన దాని నెగిచికొని వచ్చి శ్యేనంబు శిబి కిట్లనియె:—

ఆ. నిన్ను సత్యనిత్య నిర్మలుఁగా విందు
నసఘు నీకుఁ బాడి యయ్యె యిప్పు
డతి బుభుక్షితుండనై యున్న నాకు నా
హార విఘ్న మిట్లు లాచరింప. 1

సర్వభూతంబులు నాహారంబునన జీవించి వర్ధిల్లు నిది నాకు భక్ష్యంబు గాని నాఁడు బుభుక్షావేదనం జేసి ప్రాణ వియోగంబగు. అట్లయిన నా పుత్త్రులు భార్యయు జీవింప నేర రొక్క కపోతంబు రక్షించి పెక్కు జీవంబులకు హింస సేయుట ధర్మవిరోధంబు.

క. ధర్మజ్ఞులైన పురుషులు
ధర్మవునకు బాధసేయు ధర్మవు నెంచుఁ

ధర్మముగా మదిఁ దలఁపరు
ధర్మువు సర్వంబునకు హితంబుగవలయున్. 2

ఇక్కపోతంబు నాకు వేదవిహితంబైన యాహారంబు. "శ్యేనల్గ కపోతానత్తి" యను వేదవచనంబు గలదు. గావున నిది నా కాహారంబు గావలయు నిమ్మనిన దానికి శిబి యిట్లనియె:—

తే. ప్రాణభయమున వచ్చి యిప్పక్షి నన్ను
నాశ్రయించె నాశ్రితుఁ డెట్టి యధముఁడయిన
విడువఁడనినను నే నెట్లు విడుతు దీని
నాశ్రితత్యాగమిది ధర్మువగునె చెపుము. 3

నీవు పక్షివయ్యును ధర్మమెఱింగినట్లు పలికితి. శరణాగత పరిత్యాగంబునకన్న మిక్కిలి యధర్మంబొండెద్ది. నీయాఁకలి దీనన కాని యొంటు నుపశమింపదే? నీయత్నం బాహారార్థం బయ్యెనేని నిప్పు డివ్వనంబున మృగ మహిష వరాహ ఖగమాంసంబులు దీనికంటె మిక్కిలిగాఁ బెట్టెద నిక్కపోతంబువలని యాగ్రహంబు విడువుము. దీని నేనెట్లును విడువననిన శ్యేనం బిట్లనియె.

ఆ. నాకు విహితభక్షణంబిది యిప్పక్షిఁ
బూని కావ నీకు బుద్ధియేని

యవనినాథ దీనియంత నీమాంసంబు
దూఁచి నాకుఁ బెట్టు తొలఁగకిపుడు. 4

చ. అనిన ననుగ్రహించితి మహా
విహగోత్తమ యంచు సంతసం
బున శిబి తత్క్షణంబ యసి
పుత్రిక నాత్మశరీరకర్తనం
బనఘుఁడు సేసి చేసి తన
యంగములం గల మాంసమెల్లఁ బె
ట్టినను గపోతభాగమక
డిందిగ, డించుచునుండె నత్తులన్. 5

క. దాని నచ్చెరువడి ధర
ణీనాథుఁడు తనువుకంపు నెత్తురు కారుఁగం
దాన తులమెక్కె నంత
న్వాని గుణోన్నతికి మెచ్చి వాసవదహనుల్. 6

శ్యేన కపోతరూపంబులు విడిచి తమ నిజరూపంబులఁ జూపి నీ ధైర్య శౌర్యాది గుణంబు లనన్య సాధారణంబులు గావున నీకీర్తి నిత్యంబై శబ్దబ్రహ్మంబుగల యంత కాలంబును వర్తిల్లుచు నుండునని శిబికి వరంబిచ్చి యింద్రాగ్నులు చనిరి.

—నన్నయభట్టు.

# 5. అస్త్రవిద్యా పరీక్ష



అకుమారుల ధనుర్విద్యాకౌశలం బెఱుంగ వేఁడి యొకనాఁడు ద్రోణుండు కృత్రిమం బయిన భాసంబను నొక్క పక్షి వృక్షశాఖాగ్రంబున లక్ష్యంబుగా రచియించి దాని నందఱకుం జూపి మీమీధనువుల బాణంబులు సంధించి నాపంచిన యప్పుడ యిప్పక్షితలఁ దెగ నేయుం డేనొక్కొక్కనిం బంచెదనని ముందర ధర్మనందనుం బిలిచి యీ వృక్షశాఖాగ్రంబుననున్న పక్షి నిమ్ముగా నీక్షించి మద్వచనానంతరంబున శరమోక్షణంబు సేయుమనిన నతండును వల్లెయని గురువచనంబు సేసి యున్న నయ్యుధిష్ఠిరునకు ద్రోణుం డిట్లనియె:—

తే. వృక్షశాఖాగ్రముననున్న పక్షిశిరము
దెల్ల ముగఁ జూచితే మహీవల్లభుండ
యనిన నిమ్ముగఁ జూచితి ననిన వెండి
యును గురుఁడు ధర్మజున కిట్టులనియెఁ బ్రీతి. 1

క. జనసుత యీ భ్రమానిని న
న్నను మఱి నీ భ్రాతృవరులనుం జూచితె నీ
వనవుడుఁ జూచితి నన్నిటి
ననఘా వృక్షముననున్న యవ్విహగముతోఁ. 2

అనిన విని ద్రోణుండు ధర్మజుంబదరి నీదృష్టి సెదరె నీవు దీని నేయనోప వపాయమని యివ్విధంబున దుర్యోధనాదులైన ధార్తరాష్ట్రులను భీమసేన నకుల సహదేవులను నానాదేశాగతులయిన రాజపుత్త్రులను గ్రమంబున నడిగిన వారలు ధర్మనందనుండు చెప్పినట్ల చెప్పిన నందఱ నిందించి పురందరనందనుంబిలిచి వారినడిగిన యట్లడిగిన నాచార్యునకు నర్జునుం డిట్లనియె:—

క. పక్షిశిరంబు దిరంబుగ
నీక్షించితి నొండుగాన నెద్దియు ననిన
లక్షించి యేయుమని సూ
క్ష్మేక్షణు ద్రోణుండు వనిచె నింద్రతనూజున్. 3

క. గురువచనానంతరమున
నరుఁడప్పుడు శరవిమోక్షణము సేయుడుఁ జే
చ్చెరఁ బక్షిశిరము దెగి త
ద్ధరణీరుహ శాఖనుండి ధారుణిఁ బడియెన్. 4

ఇట్లు క్రమంబునఁ గృత్రిమపక్షి శిరంబుఁ దెగనేసిన యర్జును నచలితదృష్టికి లక్ష్యవేదిత్వంబునకు మెచ్చి ద్రోణుం డాతనికి ధనుర్వేదరహస్యంబు లుపదేశించె.

—నన్నయభట్టు

# 6. వర్షాగమము



క. ఖరకిరణతాపమున నురు
తరదవ దాహమున శోషితములైన వనాం
తర తరుతతి కాప్యాయన
కరమై వర్షాగమంబు గడుబెడఁగయ్యెన్. 1

క. నాలుగువలఁకుల నవఘన
జాలంబులు వ్రేలికురిసె ఝంఝానిల వే
గాలోలములై బహుల
స్థూలపయోధారలోలిఁ దుములంబులుగాన్. 2

క. ఘనతరదర్శితమంబోకో
యనఁగ ఘనాఘనత మిస్రము విరళమై క
ప్పిన జనులకు వస్తువిభా
వన మొక్కొక్కమాటు గలిగె వైద్యుత రుచులన్. 3

చ. అరుదగు దత్పయోద సమ
యంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంజదధ్వనియుఁ
బల్వలభూముల భూరిదర్దురో

# 7. ప్రభాతవర్ణనము



క. విచ్చెం దిమిరము గాఁపులు
వచ్చె మధుపకులము లబ్జవనములకురలం
జొచ్చె విరులు తరు లతికల
నిచ్చె రథాంగములు వంతయెల్లఁ దొగలకున్. 1

తే. రాలియున్న పుష్పప్రకరము విదిర్చి
చెన్నుగానున్న సేసిన సెజ్జయనగ
వేగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద
భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు. 2

సీ. నీరజాకరములు నిష్టమై జేసిన
భవ్యతపంబుల ఫలమనంగ
దివసముఖాభినందిత చక్రయుగ్మ కం
బుల యనురాగంపుఁ బ్రోవనంగ
హరిహర బ్రహ్మ మహానుభావంబు లొ
క్కటిగాఁగఁ గరఁగిన గట్టియనఁగ
నతుల వేదత్రయ లతికాచయము పెను
పొందఁ బుట్టెడు మూలకందమనఁగ

తే. నఖిలజగముల కట్టెఱ్ఱయగుచు జన స
మాజకరపుట హృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె. 3

—తిక్కన సోమయాజి

# 7. ప్రభాతవర్ణనము



క. విచ్చెం దిమిరము గాఁపులు
వచ్చె మధుపకులము లబ్జవనములకురలం
జొచ్చె విరులు తరు లతికల
నిచ్చె రథాంగములు వంతయెల్లఁ దొఁగలకున్. 1

తే. రాలియున్న పుష్పప్రకరము విదిర్చి
చెన్నుగానున్న సేసిన సెజ్జయనగ
వేగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద
భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు. 2

సీ. నీరజాకరములు నిష్టమై జేసిన
భవ్యతపంబుల ఫలమనంగ
దివసముఖాభినందిత చక్రయుగ్మ కం
బుల యనురాగంపుఁ బ్రోవనంగ
హరిహర బ్రహ్మ మహానుభావంబు లొ
క్కటిగాఁగఁ గరఁగిన గట్టియనఁగ
నతుల వేదత్రయ లతికాచయము పెను
పొందఁ బుట్టెడు మూలకందమనఁగ

తే. నఖిలజగముల కట్టెఱ్ఱియగుచు జన స
మాజకరపుట హృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె. 3

—తిక్కన సోమయాజి

నాతండు వజ్రమయదేహుండు గావునఁ దద్విషదంష్ట్రలు నాట వయ్యె; మరియు నొక్కనాఁడు భోజనసమయంబున వానికి విషంబువెట్టిన నతండు దివ్యపురుషుండు గావునఁ దద్విషం బన్నంబుతోడనే జీర్ణంబయ్యె; మఱియు వారలకెల్ల నపా యంబు సేయ సమకట్టి,

సీ. వదలక కురుపతి వారణావతమున
 లక్కయిల్లొనరించి యక్కజముగ
 నందుఁ జొన్పి యం దనలంబు దగిల్పఁ
 బనిచినం బాండునందనులు తెలిసి
 విదురోపదిష్ట భూవివరంబునం దప
 క్రాంతులై బ్రదికి నిశ్చింతులైరి
 ధర్మవు నుచితంబు దప్పనివారల
 సదమలాచారుల నుదిత సత్య
 రతుల నఖిలలోకహిత మహారంభుల
 భూరిగుణుల నిర్జితారివర్గ
 లై వెలెంగువారి దైవంబరక్షించు
 దురితవిధుల నెపుడు బొరయకుండ. 2

ఇట్లు దుర్యోధనుండు సేయు నపాయంబులవలనం బాయుచుఁ బాండవులు లాక్షాగృహదాహంబువలన నక్ష యులై జననీసహితంబుగా వనంబునకుంజనిరి. అందు భీమసే నుండు హిడింబాసురుంజంపి వాని చెలియలి హిడింబను వివా

నాతండు వజ్రమయదేహుండు గావునఁ దద్విషదంష్ట్రలు నాట వయ్యె; మరియు నొక్కనాఁడు భోజనసమయంబున వానికి విషంబువెట్టిన నతండు దివ్యపురుషుండు గావునఁ దద్విషం బన్నంబుతోడనే జీర్ణంబయ్యె; మఱియు వారల కెల్ల నపా యంబు సేయ సమకట్టి,

సీ. వదలక కురుపతి వారణావతమున
లక్కయిల్లావించి యక్కజముగ
నందఱఁజొన్పి యం దనలంబు దరికొల్పఁ
బనిచినం బాండునందను లెఱింగి
విదురోపదిష్ట భూవివరంబునం దప
క్రాంతులై బ్రదికి నిశ్చింతులైరి
ధర్మవు నుచితంబు దప్పనివారల
సదమలాచారుల నుదిత సత్య
రతుల నఖిలలోకహిత మహారంభుల
భూరిగుణుల నిర్జితారివర్గు
లై వెలెంగువారి దైవంబరక్షించు
దురితవిధుల నెపుడు బొరయకుండ. 2

ఇట్లు దుర్యోధనుండు సేయు నపాయంబులవలనం బాయుచుఁ బాండవులు లాక్షాగృహదాహంబువలన నక్ష యులై జననీసహితంబుగా వనంబునకుంజనిరి. అందు భీమసే నుండు హిడింబాసురుంజంపి వాని చెలియలి హిడింబను వివా

హంబై యేకచక్రపురంబున కేఁగి యందు బకాసురుంజంపివిప్రు లంగాచె. మఱి యందఱు విప్రవేషంబున ద్రుపదుపురంబునకుం జని యందు ద్రౌపదీస్వయంవరంబున మత్స్యయంత్రం బర్జునుం డశ్రమంబున నురల నేసి సకల రాజలోకంబునోడించి ద్రోవదిం జేకొనిన దాని నేవురు గురువచనంబున వివాహంబై ద్రుపదు పురంబున నొక్క సంవత్సరంబున్న నెఱింగి ధృతరాష్ట్రుండు వారి రావించి వారల కర్ధరాజ్యంబిచ్చి యింద్రప్రస్థపురంబున నుండంబంచె. అందుఁ బాండవులు రాజ్యంబు సేయుచున్నంత,

క. ద్వారవతి కేఁగి యర్జునుఁ
డారంగ సుభద్రఁ బెండ్లియై వచ్చి మహా
వీరు నభిమన్యుఁ గుల వి
స్తారకు సత్పుత్త్రు నతి ముదంబునఁ బడసెన్. 3

మఱియు నర్జునుండు నగ్నిదేవుచేత దివ్యరథంబును దివ్యాస్త్రంబులును గాండీవ దేవదత్తంబులును నక్షయ బాణతూణీరంబులుం బడసి సురగణంబులతో సురపతి నొర్చి ఖాండవ దహనంబున నగ్నిదేవుందనిపె. మఱియు మయువలన సభాప్రాప్తుండై భీమునిచేత జరాసంధుంజంపించి దిగ్విజయంబు సేసి సార్వభౌముండై ధర్మరాజు రాజసూయ మహాయజ్ఞంబు గావించె. ఇవి మొదలుగాఁగల పాండవుల గుణసంపదలు సూచి సహింపనోపక దుర్యోధనుండు శకుని కైతవంబున మాయాద్యూతంబున ధర్మరాజుం బరాజితుంజేసి పంద్రం

డేఁడులు వనవాసంబును నొక్కయేఁడు జనపదంబున నజ్ఞాత వాసంబును జేయునట్లుగా సమయంబుసేసి భూమి వెలువ రించినంజని పాండవులు వనవాసంబున నున్నంత,

చ. పరమ గురూపదేశమునఁ
బార్థుఁడు పార్థివ రత్నశేఖరుం
డరిదితపంబునన్ భుజ బ
లాతిశయంబున నీశుఁ బన్నగా
భరణుఁ బ్రసన్నుఁ జేసి దయఁ
బాశుపతాదిక దివ్యబాణముల్
హరసురరాజ దేవ నివ
హంబులచేఁ బడసెన్ బ్రియంబునన్. 4

—:అక్కర:—

వనమునఁ బదియురెండేడు లజ్ఞాతవాస మొక్కేడు
జనపదంబుననుండి తపనయ్యేండ్లు సలిపి సద్వ్రత్తు
లనఘులు మును వేడికొనక మఱి భారతాజిసేయంగ
మొనసిరి పాండవ కౌరవుల భేద మూల మిట్టిదియ. 5

—నన్నయభట్టు

# 9. పరిక్షితుఁడను రాజు చరిత్రము



చ. ఘనుఁడు పరిక్షితుండనఁ బ్ర
కాశితుఁడైన మహీవిభుండు భా
నునిభుఁడు భానువంశ్యుఁడు వి
నూతనకీర్తి యయోధ్య యేలువాఁ
డనుపముఁ డొక్కనాఁడు మృగ
యారతుఁడై చరియించెఁ గానన
మ్మున నొకరుండ యిమ్ముల న
పూర్వజవోగ్రహయాధిరూఢుఁడై. 1

ఇవ్విధంబునం బెక్కు మృగంబుల వధియించుచుఁ గ్రుమ్మరువాఁ డొక్కయెడ,

ఆ. మదగజాభిరామ మృదులయానంబొప్ప
నల్లఁ బొదలుచును లతాంతరములఁ
గరములీలఁ గమ్మవిరులు గోయుచు నున్న
పువ్వుఁబోఁడి నొక్కపొలఁతిఁ గనియె. 2

క. కని యంత గదిసి యా కా
మిని యొప్పునఁ జూడ్కి దగులుమీఱిన దమకం

బున ననిమిషలోచనుఁడై
జననాథుఁడు మదనబాణ సంహతిఁ దూలెన్. 3

అదియును నతిసుందరంబైన తదీయమూర్తి విభవంబునకు మెచ్చి సాభిప్రాయంబుగా నవలోకించె నంత నమ్మహీకాంతుం డక్కాంత కిట్లనియె.

ఉ. ఎవ్వరిదాన వంబుజ ద
ళేక్షణ యేకత మిట్టులేల నీ
వివ్వనభూమియందుఁ జరి
యించెదు నావుడుఁ దంఁడ్రిపంపునం
దివ్వనభూమియందు జరి
యించెద నెవ్వరుఁగోరు కన్య నే
నెవ్వరిదానఁ గావలయు
నేర్పడఁ జెప్పుము రాజనందనా. 4

అనిన దాని ప్రగల్భవచనంబులకు నధిక విలోలుండై భూపాలుండు దన యభిప్రాయం బెఱింగించిన నమ్మగువ నన్నెండును జలవిహారంబునకుం జూనుపకుండు నది యట్లయిన నిన్ను వరియించెదననిన వాఁడును దత్సమయంబున కొడంబడి దానిం దోడ్కొని పురంబునకుం జనుదెంచి యిష్ట సుఖ తత్పరుండయి యుండె నంత నొక్కనాఁడు శరత్సమయంబు నందు,

చ. అతులిత పుష్ప పల్లవ
ఫలాన్విత భూరుహ భూరివల్లరీ
వితతులఁ జారుకైరవ
నవీన సరోరుహ షండమండలీ
యత సరసీ మనోహర
ము లైన పురోపవనంబులన్ సము
న్నత విభవుండు వాస భ
వనంబులొనర్పఁగఁ బంచి యిమ్ములన్. 5

క. దేవీ సహితంబుగ ను
ర్వీవరుఁ డవ్వనమునందు విహరించె ఘనాం
తావసర వాసరంబుల
భావిత పద్మ వన పవన పరిచితుఁ డగుచున్. 6

అంత నొక్కనాఁడు నితాంత ఘర్మ జలకణ కలిత శరీరుండై ప్రియాసమేతుండై వాసగృహంబు వెలువడి తత్సమీపంబున నతి మనోహరం బైన కమలాకరంబుగని దానితీరంబున నయ్యిగ్మలి నునిచి దాను గృతావగాహుండై,

క. మేలై యున్నది జలము వి
శాలనయన చెమటయుడుగఁ జయ్యన దేహ
క్షాలన మొనరింపుమనిన
నాలేమ దరస్మితాననాంబుజ యగుచున్. 7

ఆ. మడుఁగుసొచ్చి మునిఁగి మాయమైపోయిన
నద్భుతాత్ముఁడగుచు నవనివిభుఁడు
మడుఁగు గలయ వెదకి మానినిఁ గానక
జలములెల్ల వెడలఁజల్లెఁ గడఁగి. 8

ఇట్లు సల్లిన నందు మండూకంబు లనేకంబు లున్నం జూచి యివి మత్ప్రియాంగనను మ్రింగినవిగాకేమియని కలుషించి యనుచరులం బిలిచి నాకుఁ బ్రియంబు సేయవలసిన వార లైతిరేని నిప్పుడమింగల కప్పలనెల్లం బొడవడంగించు నది యని పంచిన నలుదిక్కులకుం జని తదీయ కింకరవర్గంబు,

చ. కొలఁకుల వాఁగులన్ నదులఁ
గ్రోవుల బావుల నిర్ఝరంబులం
గలయఁగ రోసి రోసి వడిఁ
గప్పలఁ గుప్పలుగా వధించుచో
నలుగులమందు భేక నివ
హంబు గనుంగొని భేకనాయకుం
డలఘు తపస్విరూపమున
నానృపుపాలికివచ్చి యిట్లనున్. 9

ఉ. అక్కట లోకమెల్ల నగ
నాఁడడి కప్పలఁజంప దీన నీ
కెక్కడి పెంపుగల్గుఁ బృథి
వీశ్వర కోపముడింపు కప్పలం

జక్కనిచూడ్కిఁ జూడుమికఁ
జాలునధర్మము నావుడున్ విభుం
డెక్కడిమాట నామదికి
నెగ్గొనరించెఁ గడంగి భేకముల్. 10

క. నాయిష్టవనిత మ్రింగిన
మాయపుఁ బుర్వులివి వీని మడియింతు మునీం
ద్రా యరుగుము నీవనుటయు
నాయన యత్యంత దుఃఖితాత్ముం డగుచున్. 11

ఏను మండూకనాయకుండ నాయువనువాఁడ నమ్మగువ నాకూఁతురు సుశోభన యనునది దానిచేత ననేకులు బేలుపడిరి నీవెంతవాఁడ వనిన నప్పరిక్షితుం డల్లని నాకు నన్నెలఁతఁ దెచ్చి యొప్పింపవలయునని ప్రార్థించిన నతండు నవ్వుచు నవ్వామనయనం దన తలంపున రావించి యారాజునకు నిచ్చి నిజేచ్ఛం జనియె.

—యెఱ్ఱాప్రగడ

# 10. విరటుఁడు—మల్లురును



తే. ఇట్లు దమతమ వర్తిల్లు నెడల సకల
జనములకు హృదయానురంజన మొనర్చి
తాల్మియు నిలోఁట యడఁకువ తగవు మెలపు
నెఱిదెఱంగును బాటింప నేర్పుగలిగి. 1

క. ఉన్నతఱి వివిధదేశో
త్పన్నులు నద్భుతవిధాయి బలవిక్రమ సం
పన్నులు నగు మల్లులు విభ
వోన్నతుఁడగు విరటుపాల నుద్భటవృత్తిన్. 2

క. తమలోన మాటలాడెడు
సమయంబున నొక్కరుఁడు విశాలోరస్కుం
డమితబలుఁడు పంచానన
సమభీషణమూర్తి యధికసంరంభమునన్. 3

అన్నరపతి కట్టెదుర నిలిచి భుజాస్ఫాలనంబు సేసి యిట్లనియె.

తే. నేలనాలుగుచెఱఁగుల నృపులకొలువు
లందు నేను వర్తించితి నవనినాథ
యగ్గలించి నా యెదుర బాహాస్ఫాలించి
కడఁగఁజాలెడు మల్లురఁ గాననెందు. 4

చ. అనునెడ వానియుగ్ర సము
దాకృతియుం బటువాక్యవృత్తియుం
గని విని మల్లురెల్ల భయ
కంపితమూర్తులు దాల్చి మాఱువ
ల్కను గనువిచ్చిచూడను మొ
గం బెగయింపను జాలకున్న న
జ్జనపతి వేడ్క ప్రమోదపడు
చందముగాంచి యుధిష్ఠిరుం డనున్. 5

క. వీనికి మార్కొనఁజాలెడు
దానికిఁ దగువాని ధర్మతనయుని పురిలో
నానాని యుద్ధలంపటు
నేనొక్కనిఁగంటి నిప్పు డిందులనతఁడున్. 6

క. మనబానసీఁడు వలలుఁ
డను శూద్రుఁడు నాకుఁ దెల్ల మధికబలుల నో
ర్చినవాఁ డనేక మల్లుల
నిను మెచ్చింపంగఁజాలు నిజమిది యధిపా. 7

క. అనవుఁడు భూపతి పిలువం
బనిచె నతని నతఁడు నపుడ భయభక్తులతోఁ
జనుదెంచి మల్లవర్గము
గని మై వెఱుగంగ నిలిచెఁ గౌతూహలియై. 8

ఇట్లు నిలిచిన పవనతనయు నవలోకించి యవనీవల్లభుం డమ్మల్లముఖ్యుం జూపి యితనితోడి యుద్ధంబునకు సన్నద్ధుం డవు గమ్మనిన నతండును ధర్మతనయు కనుసన్న గనుంగొని యమ్మత్స్యవిభునకు వినయంబుతో నిట్లనియె.

తే. అధిప ధర్మజుపాల నున్నప్పు డతని
వేడుకకుఁ దగఁ బెనఁగుదు వింతలైన
జెట్టి మల్లులతో నిప్పు డట్లపోలె
నీదు వేడ్కకుఁ బెనఁగెద నేర్చినట్లు. 9

అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబున నంగణంబుసొచ్చి, భూపాలునిముందట భుజాస్ఫాలనంబు సేసి మ్రొక్కి మరలు నెడ నంతకుమున్న యమ్మల్లవరుండు నరపతి యనుమతి వడసి కృతపరికరబంధుండై యరుగుదెంచి యచ్చట నునికిం జేసి యతండును ననిలసుతుండును బరస్పరమూర్తుల నవలోకించి యుద్ధరంగంబు మన్ను ఫాలప్రదేశంబుల ధరియించి శరీరంబులపైఁ జల్లుకొని రెండుసేతుల మునిప్రేళ్ళను గొండొకవుచ్చికొని యొండొరులదెసకు వైచి యున్నతంబులగు నపసవ్యకరంబుల నాకుంచితసవ్యబాహుతలంబుల నప్పళించు చప్పుళ్ళు గలసి యొక్కరుండ మల్లసఱచిన చందంబున వీతేర వింతతానకంబుల నిలిచి కదిసిన యప్పుడు వృకోదరుండు,

సీ. ఉపతాయిలోఁ దన కొదవిన తోరహ
త్తము సూపి ప్రేయక సమదవృత్తిఁ

బాసి క్రమ్మఱఁజేరు బలువిడివాఁడు పై
నడరిన జరగక యవనిఁ గ్రుంగి
నిలుచునొత్తొరవున వలచినయప్పుడు
గొనిపోవు నవలీలఁ గూలవైచుఁ
జళికిపట్టిన మునుసన్నపు విన్నాణ
ములుదొరకొన్నను ముట్టఁగొనఁడు

తే. కాలిదెసఁ జొరవచ్చుట గానిపినిచి
యుడుగుసీసానఁ బట్టియు నుప్పళించుఁ
బోవనిచ్చు మగుడవేచి పోరఁజేరు
నెడలసరిసేయనగు తడవీకహత్తు. 10

మఱియు ననేకగతుల యోజలు మెఱయుచుఁ గొం
డొకసేపు విరాటునకు వినోదంబు సలిపి,

ఆ. కచ్చయమరఁబట్టి కాళ్ళను జేతులు
వ్రేల మత్తగజము లీలమెఱయ
ముష్టిబలువు నెరయ ముక్కునవాతను
నెత్తురొలుక మల్లు నెత్తివైచె. 11

ఇవ్విధంబున విసరి నేలతో వ్రేసి వీపున మండివెట్టిన,

క. పెలుకురితాళంబీమదిఁ
దలఁచి యనువుగాక ధరణితలముఁ గరతలం
బుల నప్పళించెవాఁడ
కొక్కెలువార్వఁగ విడిచి మెఱసెఁ గుంతీసుతుడున్. 12

—తిక్కన సోమయాజి

# 11. సూర్యాస్తమయ వర్ణనము



క. ఇనుఁడు దనకడకు నేతెం
చిన రాగముఁబొందుటది యుచితమనఁగాఁ గెం
పున మెఱసి పశ్చిమాశాం
గన జన సంభావనముల గౌరవ మందెన్. 1

ఉ. చుక్కలు తోడుతోడఁ దల
చూపఁదొడంగె మనోభవుంబు వి
ల్లెక్కిడి చక్రవాకముల
యుక్కలురోయఁగఁ జొచ్చె నెలకెం
పెక్కుచు వచ్చె దీవియల
మేల్తెలి సోయగమందె సందడుల్
దక్కెఁ బురంబు వీథుల మ
దంబొలసె న్విట చిత్తవృత్తులన్. 2

—తిక్కన సోమయాజి

# 12. అసమాన స్పర్థ



సీ. అంబుధిలో నొక్క యలఘుతర ద్వీప
మున ధర్మవర్తినాఁ జను నరేంద్రు
పురమున నొకవైశ్యవరుఁ డధ్వరాది స
త్కర్మరతుఁడును శాంతి దాంతియుతుఁడు
గరుణాపరుఁడు దాన నిరతుండు ధనధాన్య
శోభియు బహుపుత్ర లాభ విలసి
తుండు నై వర్తించుచుండఁగ నిలుసేరె
నొకకాకి యతని పుత్రకులు దాని
గీ. యెంగిళులు వెట్టి కొనియాడ నెలమిఁ బెరిగి
క్రొవ్వి కడుమీఱి యెట్టిపక్షులును దన్నుఁ
బోలవనియెడు దుర్మానమునఁ దృణీక
రించి యది పెక్కుభంగులఁ గ్రీడసలుపు. 1

ఇట్లు విహరించుచుండ నొక్కనాఁడు గొన్ని హంసంబులు పక్షబలంబున సుపర్ణుతో సరిసేయందగు నట్టివి సముద్రంబు చేరువఁ జనంగని యాకోమటి కొడుకు లక్కాకంబునకు వానింజూపి యిట్లనిరి.

క. పులుఁగులలో నీవెక్కుడు
విలసద్గతి వంచలిట్లు వినువీథిఁ గరం

బెలమిం జనియెడు పీనిం
గలసి పఱచి గెలువవలదె గతుల బహులతన్. 2

అని తారతమ్య జ్ఞానహీనులగు నయ్యల్పబుద్ధులు సెప్పిన నుచ్ఛిష్టదర్పితంబగునదియును మౌర్ఖ్యంబునం దానం తటి దానినని తలంచి వానిదెసకుం జని మనంబున వీనిలో మేటి యెయ్యదియో యనుచుం జేరి తన చూడ్కికి వచ్చిన యంచంబురుడించి పఱతము రమ్మని పిలచిన నయ్యంచ లన్నియుం బెలుచన నవ్వి యవ్వాయసంబున కిట్లనియె.

క. మానస సరసి వసింతువు
హీనబలము జవముఁ బక్షులెల్లను బొగడం
గా నెందుఁ దిరుగుదుము ద
వైన్యనను ఖేదంబులేదు హంసలమగుటన్. 3

ఇట్టి మాయందును,

క. బలశాలియైన హంసముఁ
బిలిచితి పురుడించి పాఱ బేలతనమునన్
గలవే యింతకు మును హం
సలతోఁ బురుడించు వాయసములు జగమునన్. 4

సీ. అనుటయుఁ గాకమిట్లను హంసములతోడ
గతులు నూటొక్కటి గలుగుదాన

నొక్కటొక్కట శతయోజన వ్యాప్తినే
మెఱయుడుఁ బొడవుగా మీఁదికెగసి
చనుట యచ్చోటనుండి చక్కనేలకు జోడు
పట్టిడిగ్గుట దూరపాతభంగి
సంగతి పరువడిజాఱు లీలాగతి
వక్రయానము వలయక్రమంబు

ఆ. వె. లోనుగాఁగ నెట్టులైనను మీకోరి
నట్లు పఱచి మేటిహంసమైన
దానినిపుడ గెలుతుఁ దక్కటి హంసలు
భయమువొందఁ గాకి పదువువొంగ. 5

అనుటయు విని మున్నాహూతంబైన హంసంబా కాకంబు నాలోకించి,

గీ. నూఱుగతుల నీవు వాఱుదేనన్నియు
నెఱుఁగఁ బులుఁగులెల్ల నెట్లువాఱు
నడరి యాకసమున నిడుబాటనట్లు పా
ఱుదమురమ్ము జలధి చదలననిన. 6

ఆయెడంగూడిన కాకంబు లపహసించి శతప్రకారగతి యగు దీనితో నేకయానపర్యవసాన హీనసముత్సాహదోహలి వగు నీ వెట్లు మచ్చరించెదవు పఱచి భంగపడియెదవుగాక యనుటయు నమ్మరాళంబా గమిం బాసి పఱవఁదొడంగి

పాటిపాటి డయ్యుటయు నయ్యంచ యుదంచిత త్వరిత గమన కళా వైదగ్ధ్యంబు మెఱయింబఱచిన బఱువిడి కాకం బాకులాంతరంగంబును వికలాంగంబునునై యిట్లనివితర్కించు,

క. సేరక త్రోడరితిఁ గ్రాఁగొన
భూరుహములు లతలు గిరులు పొదలేమియులే
వారయఁ బహుసత్త్వమయము
వారిధి, డిగి సోఁకినపుడ వలయుం బొలియన్. 10

అనుచు దీనమానసంబై భయంబునం గలంగి యవశత నంతకంతకుడిగుచున్న యక్కాకింగనుంగొని హంసంబిట్లనియె.

గీ. నీ వనేకగతులు నేర్తి గదియేగతిఁ
జనుట చెపుము వాయసంబ యేను
గడవ నరిగి పిలువఁగా నేలదడసెద
వెఱకలేటి కిట్టు లెడలవిడువ. 11

అనిమె నట్టియెడ,

క. తలరుచి జలములు పక్షం
బులుఁ దుండము దోఁక సోఁకఁ బొరిఁబొరి నెగయన్
బలమఱి మెయి దిగఁబడఁగా
సొలసి యెగయలేక వాయసుఁడు వెగడొందెన్. 12

ఇట్లు మున్నీటిపయింబడి బెగ్గలంబగు దురవస్థకు నగ్గం బగు కాకంబునాలోకించి పలుకనగుంగాక పలికినట్ల యెవ్వ రికిఁ జేయఁ దీఱుఁబని తీఱెంగదాయనిన రాయంచకు నక్కా కం బిట్లనియె,

క. ఎంగిళులుఁ గుడిచి క్రొవ్వనఁ
బొంగినమెయితోడ గర్వమునఁ దిరుగుచు నా
కుంగలదె యెందు నెదురు వి
హంగమపతినైన గెలుతునని మునుఁదలతున్. 13

క. నాకోలది యిప్పుడెఱిఁగితి
నీ కరుణాలోకనంబు నిగిడించి శర
ణ్యా కావు, నన్ను మగుడం
గాకులలోఁ గలుపఁదగవు గాదే నీకున్. 14

అని యిత్తెఱంగున,

క. ఆకులతఁ బొంది పలుకుచుఁ
గాకాయని చంచు దెఱచి కడు నఱచుచు నీ
రాకరమున మునిఁగెడు న
క్కాకిం గని హంస పరమకారుణ్యమునన్. 15

క. వెఱవునఁ దత్తనువుం దన
చరణంబుల నిఱికి యెత్తి చావుడిపి బల
స్ఫురణంబు మెఱయ వీపున
ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్. 16

ఇవ్విధంబునం దెచ్చి యెప్పటిచోటన డించి రాయంచ యక్కాకి దెప్పిఱిన, దానితో నచ్చటి కాకులు విన నింక నిట్టి యవినయంబు లెన్నటికినిఁ జేయకుమని పలికి నిజసహచరంబు లగు మరాళంబులుం దానును వలయుచోటికిం జనియె.

—తిక్కన సోమయాజి

శ్రీ

# వ న మా ల

## ద్వి తీ య భా గ ము

## 1. ద్రోణాచార్యుల వృత్తాంతము

హస్తినాపుర బాహ్యంబున ధృతరాష్ట్ర పాండునందను లందఱుఁ గ్రీడాపరులయి వేడుకతో నాడుచున్న కాంచన కందుకం బొకటి నూతంబడిన,

ఆ. నీరిలోనఁదోఁచు తారక ప్రతిబింబ
మొకొ యనఁగ వెలుఁగుచున్న దాని
రాచకొడుకులెల్లఁ జూచుచునుండిరి
దానిఁబుచ్చుకొను విధంబులేక. 1

అట్టి సమయంబున,

క. నానావిధ శరశరధుల
తో నున్నతచాపధరుఁడు ద్రోణుఁడు వారిం
గానఁ జనుదెంచి యంతయుఁ
దా నప్పుడెఱింగి రాజతనయుల కనియెన్. 2

చ. భరతకుల ప్రసూతులరు
భాసుర శస్త్రమహాస్త్రవిద్యలం
గరము ప్రసిద్ధులై పరగు
గౌతము శిష్యుల రిట్టిమీకు దు
ష్కరముగ నూతిలోఁ బడిన
కాంచన పిండుఁ గొనంగ లేక యొం
డొరుల మొగంబుసూచి నగు
చుండఁగఁ జన్నె యుపాయహీనతన్. 3

దీని నాబాణపరంపరంజేసి పుచ్చుకొని మీకిచ్చెదఁ జూడుఁ డీ విద్య యొరు లెవ్వరు నేరరని ద్రోణుం డొక్కబాణం బభిమంత్రించి దృష్టి ముష్టి సౌష్టవంబొప్ప నాకందుకంబు నాఁటనేసి దాని పుంఖంబు మఱియొక బాణంబునఁ గాడ[illegible] వరుస బాణరజ్జువు గావించి దానిం దిగిచికొని యిచ్చినంజూచి యారాజకుమారులెల్ల విస్మయంబంది ద్రోణుందోడ్కొని చని భీష్మని కంతయు నెఱింగించిన నాతండును,

క. ఆసన్న ఫలితు ననఘు శ
రాసన గురు భూరిసత్త్వ నసిత కృశాంగున్
భాసురవరుఁ ద్రోణుఁ గుణో
ద్భాసితు వినినట్ల సూచి పరమప్రీతిన్. 4

క. ఎందుండి వచ్చితిందుల
కెందుండఁగ నీకు నిష్ట మెఱిఁగింపు జగ

ద్వందిత యని యడిగిన సా
నందుఁడు ద్రోణుండు భీష్మునకు నిట్లనియెన్. 5

ఏను ద్రోణుండనువాఁడ భరద్వాజపుత్త్రుండ నగ్నివేశుండను మహామునివరు నొద్ద బ్రహ్మచర్యాశ్రమంబున వేదాధ్యయనంబు సేసి ధనుర్వేదం బభ్యసించుచున్ననాఁడు పాంచాల పతియైన పృషతుపుత్త్రుండు ద్రుపదుం డనువాఁడు నాకిష్టసఖుండయి యెల్లవిద్యలు గఱచి యేను పాంచాలదేశంబునకు రాజయిననాఁడు నాయొద్దకువచ్చునది నారాజ్యభోగంబులు నీవు ననుభవింప నర్హుండవని ప్రార్థించి చని పృషతు పరోక్షంబునఁ దద్దేశంబునకు రాజైయుండె నేను గురు నియుక్తుండనయి గౌతమిం బాణిగ్రహణంబుసేసి యకుమారు నశ్వత్థామ నధిక తేజస్వినాత్మజుంబడసి ధనంబు లేమిం గుటుంబభరణంబునం దసమర్థుండనయి యుండియు,

క. పురుషవిశేష వివేకా
పరిచయులగు ధరణిపతులపాలికిఁ బోవం
బరులందు దుష్ప్రతిగ్రహ
భర మెదలో రోసి ధర్మపథమున నున్నన్. 6

క. ధనపతుల బాలకులు ముద
మున నిత్యముఁ బాలు ద్రావఁబోయిన నస్మ
త్తనయుండు వీఁడు బాల్యం
బున నేడ్చెను బాలు దనకుఁ బోయుండంచున్. 7

దానింజూచి దారిద్ర్యంబునకంటెఁ గష్టంబొండెద్దియు లేదు. దీని నాబాలసఖుండగు పాంచాలుపాలికిం బోయి పాపి కొందు నాతండు దనదేశంబున కభిషిక్తుండు గాఁబోవుచుండి నన్ను రాఁబనిచిపోయె.

మత్తకోకిల. వేఁడు టెంతయుఁ గష్టమైనను
వేఱులేని సుహృజ్జనుల్
వేఁడికో లుచితంబ కావున
వేడ్కతోఁ జని సోమకుల్
వేఁడినన్ ధనమీయఁడేనియు
వీనిమాత్రను నాలుగేన్
పాఁడికుఱ్ఱల నీఁడె వీనికిఁ
బాలుద్రావుచు నుండగాన్. 8

అని నిశ్చయించి ద్రుపదునొద్దకుం బోయి నన్నెఱింగించిన నాతండు దన రాజ్యమదంబున నన్నును దన్నును నెఱుంగక యేను రాజను నీవు పేదపాఱుండవు నాకును నీకును నెక్కడి సఖ్యంబని పలికిన వానిచేత నవమానితుండ నయి వచ్చితినని ద్రోణుండు దన వృత్తాంతంబంతయుఁ జెప్పిన,

క. విని రోయుతీగ గాళ్లం
బెనఁగెఁగదా యనుచుఁ బొంగి భీష్ముఁడు ద్రోణున్
ఘనభుజ నభీష్టపూజల
ధనధాన్య విధానముల ముదంబున దనిపెన్. 9

మఱియును,

చ. మనుమలనెల్లఁ జూపి మతి
మంతుఁడు శాంతనవుండు వీరిఁ జే
కొని గురువృత్తి మైఁగఱపు
ఘోరశరాసన విద్యలెల్లఁ బెం
పున జమదగ్నిసూనుఁడును
బోలఁడు నిన్ననివిందు, విల్లునే
ర్పున నయనైపుణంబునను
భూరిపరాక్రమ బాహుసంపదన్. 10

—నన్నయభట్టు

# 2. కౌశికుని కథ



కౌశికుండను బ్రాహ్మణుండు ధర్మతపశ్శీలుండు సంతతాధ్యయన తత్పరుండయి యొక్క శిష్టగ్రామంబుననుండు నాతం డొక్కనాఁడు గ్రామసమీపంబునం దొక్క వృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండం దదీయ శాఖాగతంబైన కొక్కెర యొక్కం డాతనిపై రెట్ట వైచిన నమ్మహాద్విజుం డలిగి చూచుటయు నది యప్పుడ నిశ్చేతనంబై నేలంబడినం గనుంగొని యతండు,

క. అక్కట నా హృదయము గడు
నక్కటికంబెల్ల మాలె ననిమిత్తము యీ
కొక్కెర నిటుసేసితి నా
కెక్కడిశాంతి యని వికలహృదయుండగుచుఁ. 1

పెక్కుభంగుల వగచి మధ్యాహ్నంబగుటయుఁ గృతాహ్నికక్రియావిధానుండై గ్రామంబున కరిగి యందు శుచులైన విప్రగృహంబుల కరిగి భిక్షాచరణంబుసేయుచు నందొక్క పుణ్యగృహంబువాకిట నిలిచి భిక్షాందేహి యనుటయు నాయింటి సతియు నతి సంభ్రమంబున భిక్షయిడుటకుం బాత్రశోధనంబుసేయు నెడ

ఉ. ఆ యెలనాఁగ భర్త గను
　　　నాఁకటఁ దూలుచు వచ్చె వచ్చినం
దోయజనేత్ర సంభ్రమము
　　　తోఁ దగు పీఠము వెట్టి పాద్యముల్
బాయక మజ్జనక్రియయు
　　　భక్తినొనర్చి ప్రియోక్తులొప్పఁగన్
నాయనఁ దృప్తుఁజేసె రుచి
　　　రాన్నరసంబుల నింతి చెచ్చెరన్. 2

చ. కుడిచినపిమ్మటం గుసుమ
　　　కోమలి విస్తృత సంస్తరంబుగా
నొడికపు సెజ్జసేసి ప్రియుఁ
　　　డొయ్యన యందు శయింపఁ దమ్మలం
బిడి చరణంబులొత్తి మది
　　　రేక్షణ యంతటిలోఁ దలంచె ము
న్నడరఁగ భిక్షుకై నిలిచి
　　　నట్టి మహీసురముఖ్యు నాత్మలోన్. 3

ఇట్లు దలంచి భిక్షగొనుచుం జనుదెంచిన నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజితలోచనుండగుచు నిట్లనియె.

క. అడిగినయప్పుడ చెచ్చెరఁ
గడపినబో నవ్వయేను గడుదుర్మతివై

పడఁతి నను నిలిపి భిక్షం
బిడక కడు నవజ్ఞ సేసితేల మదమునన్. 4

చ. అనినఁ బతివ్రతాతిలక
మాతనికిట్లను నయ్యమత్ప్రియుం
డనుప మిత క్షుధాచలితుఁ
డై చనుదెంచిన భక్తినమ్మహా
త్మునకు సపర్య సేయుచు మి
మున్ మదిలోనఁ దలంపఁజాలనై
తి నిదియుఁ దప్పుగాఁ గొనక
ధీరతమొప్ప సహింపఁగానగున్. 5

అనిన నమ్మహీదేవుం డప్పతివ్రత కిట్లనియె,

ఉ. నీ మగఁ డింతయెక్కుడె మ
నీషులు భూసురు లంత తక్కువే
కోమలి యేల యిట్లు గడుఁ
గ్రొవ్వునఁ గానవు లోకవంద్యులన్
భూమిసురేంద్రులన్ దివిజ
పుంగవుఁ డాదిగ భక్తిఁగొల్చుచో
నేమిటికొక్కొ వారు గడు
నెగ్గిదమైరిటు నీకు నిచ్చటన్. 6

క. అవమానితులై ధరణీ
దివిజులు కోపాగ్నిశిఖల దీపించి మహా

ద్రి వనద్వీపంబులతో
నవనినయిన్ బొడవడంతు రప్రతికారుల్. 7

నీ వింత నొల్లవైతివి గాకేమి యనిన నయ్యంగన
యిట్లనియె,

సీ. దేవతాసములు భూదేవతావరులయ్య
యేను దన్మాహాత్మ్య మెఱుఁగనయ్య
యొక విప్రుఁ డలిగి పయోనిధి జలముల
పేయముల్ గాఁగ శపింపఁడెట్లు
దండకవిషయంబు దగ్ధంబుసేయండె
యలుకమై నొక్క మహాద్విజుండు
వాతాపియను దైత్యవరు మ్రింగి యఱిగించు
కొనఁడె భూదేవుఁ డొక్కరుఁడు గినిసి

తే. ధరణి మఱియును బెక్కువిధంబులందు
బ్రహ్మవిదులైన బ్రాహ్మణప్రభుల మహిమ
విని యెఱుంగనె యేను సద్వినుతచరిత
కొఱవిగొని వెట్టినే తల గోఁకికొనఁగ. 8

నా తెఱంగు సెప్పెద నాకర్ణింపుము.

తే. పతియె చూవె నా పాలిఁటి పరమదైవ
మేను వాఙ్మనఃక్రియలఁ దద్హితమయెపుడుఁ
గోరి యొనరింతు నివి నాకు గొనకొనంగ
ధర్మములుగాఁగ నుండుదుఁ దలఁచిచూడ.

నీ పతి క్రోధనుండవగుటయు నెఱుంగుదు. నీ కోపంబున నొక్క కొక్కెర నిహతంబయ్యెంగాదె యిది మదీయ పాతివ్రత్యమహిమ జేసి కాంచితిం గానఁ గ్రోధంబుగొని యాడుట లగ్గుగాదని మఱియు నిట్లనియె.

తే. క్రోధ మోహనామకులైన ఘోరశత్రు
లిరువు రెరియించుచుండుదు రెపుడు నరుని
నంతరంగమయ్యు భయంబు నడఁపకున్నఁ
గలదె యూరక బ్రాహ్మణగౌరవంబు. 10

సీ. ఎవ్వఁడు సత్యంబు నెప్పుడుఁబల్కు హిం
సావిదూరుఁడు గురుజనహితార్థి
యింద్రియంబులనోర్చి యెల్లవారలఁ దన
యట్లకాఁజూచు ధర్మాభిరతుఁడు
గామంబు దగులండు కర్మంబు లాఱును
సముచిత సంప్రయోజ్యత నొనర్చు
నట్టి పుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁడని
యనిశంబు గీర్తింతు రమరవర్యు

ఆ. లార్జవంబు శమము నధ్యయనంబును
బరమధనము సువ్వె బ్రాహ్మణునకు
ధర్మగతికి నవియ తగుసాధనంబులు
వేదవిహిత ముఖ్యవిధులు నివియ. 11

ధర్మంబు బహు మార్గదృష్టంబయి సూక్ష్మంబయి యుండు నీవు కేవల స్వాధ్యాయపరుండవు గాని ధర్మసూక్ష్మత యెఱుంగవు గావునం దడయక మిధిలానగరంబున కరుగుము అందు జితేంద్రియుండును సత్యవాదియు మాతాపితృభక్తుం డును నయినవాఁడు ధర్మవ్యాధుండను కిరాతుండు నీకు నఖిల ధర్మంబులు నెఱింగించి సంశయచ్ఛేదంబు సేయు. నీవు నా వలనం బ్రసన్నుండవగునది. వనితలకుం బరిజ్ఞానంబు లేదు గావున నా కెట్టివారయి యపరాధంబు సేసినను సహింపవలయుఁ గదా యనినఁ గౌశికుం డిట్లనియె.

క. ననుదూఱందగు నీకత
మున నా చిత్తము ప్రశాంతిఁ బొరసెఁ బురంధ్రీ
జనవినుత పోయి వచ్చెద
ననుపమ శోభన సమృద్ధు లయ్యెడు నీకున్. 12

—ఎఱ్ఱాప్రగడ

# 3. సుభద్ర

ఉ. ద్వాదశ మాసికవ్రతము
ధర్మవిధిన్ సలుపంగ నేఁగి గం
గాది మహానదీ హిమవ
దాది మహాగిరి దర్శనంబు మీ
పాదపయోజదర్శనముఁ
బన్నుగఁజేయుటఁ జేసి పూర్వ సం
పాదిత సర్వపాపములు
వాసెభృశంబుగ నాకు నచ్యుతా. 1

అనిన విని నగుచు నబ్జనాభుం డర్జును నతి స్నేహం బునం గౌఁగిలించుకొని యెల్లవారి కుశలంబడిగి యతని తీర్థాభి గమన నిమిత్తంబును విని సుభద్రయందు బద్ధానురాగుం డగుట నుపలక్షించి ద్వారకానగరంబునకుఁ దోడ్కొనియరిగి,

ఉ. భ్రాజిత శాత కుంభ గృహ
పంక్తులఁ బుష్పితవల్లివేల్లితో
ద్యాన వనావళిన్ విమల
విద్రుమ వజ్ర విచిత్రవేదికా
రాజిఁ గరంబు రమ్యమగు
రైవతకాచల కందరంబునన్

రాజకులైకసుందరుఁ బు
రందరనందను నుంచెఁ బ్రీతితోఁన్. 2

క. శ్రీపతి కడు నెయ్యంబున
నాపోవక పార్థునొద్ద నారాత్రి ప్రియా
లాపములఁ దగిలియుండెను
దీపమణుల్ వెలుఁగ భువనదీపకుఁ డంతన్. 3

ఇట్లు పరమపురుషులయిన నరనారాయణు లిద్దఱుఁ దమ పూర్వజన్మ సహవాసంబునట్లప్పుడు పరమానందంబునఁ బరస్పర ప్రియ మధుర సంభాషణంబుల నొక్కట నుండి యారాత్రిఁ గడపి రంతఁ బ్రభాతంబున వాసుదేవుండు వాసవ నందను నంద యుండంబంచి కాంచన రథారూఢుండయి పురంబునకుం జని పౌరజన ప్రధాన సమక్షంబున రైవతక మహోత్సవంబు ఘోషింపం బంచిన,

చ. పొలుపుగఁ బూసి కట్టికొడి
భూరివిభూతి ప్రకాశితంబుఁగా
గలయఁగఁ దత్పురీజనులు
కాంస్యమృదంగక శంఖభేరికా
హళ పటహధ్వను ల్వెలఁగ
నాటలుఁబాటలు నొప్ప నెల్లవా
రలు సనిచేసి రర్చనలు
రైవతకాద్రికి నుత్సవంబుతోఁన్. 4

సీ. సారణ సత్యకాక్రూర విదూరథ
సాంబ సంకర్షణ శంబరారి
భానుసుషేణోగ్రసేన సైనేయాని
రుద్ధ హార్ధిక్య గదోద్ధవాది
యాదవు లధికప్రమోదులై యొక్కటఁ
దరుణులుఁ దారును గరికరేణు
హయ శిబికారూఢులయి తదుత్సవమున
కరిగిరి మరి జగద్గురుఁడు కృష్ణుఁ
డింద్రలీలతో నుపేంద్రుండు రుక్మిణీ
దేవి మొదలుగాఁగ లేమ లెల్ల
నొప్పితోడ రాఁగ నప్పర్వతమునకుఁ
జనియె సకలజనులు దనకు నెరఁగ. 5

ఇట్లరిగి జనార్దనుండు ధనంజయుం దలంచి తత్సమీపగతుండయి తోడ్కొని యాతనికి నప్పర్వత రమణీయ ప్రదేశంబులం జూపుచు విహరించి యిద్దఱు నొక్క విమల మణి వేదికయం దభిమత సంభాషణంబుల నుండు నంత,

చ. క్వణదను కింకిణీకలిత
కాంచన కాంచి కలాపమున్ రణ
న్మణికల నూపురంబులు స
మధ్వనినొప్పఁగ భక్తిఁ బాదచా

రిషి యయి కన్యకా జన ప
రీత సుభద్ర తదద్రిపూజన
ప్రణతులు సేసె నింద్రసుతుఁ
బార్థు నిజేశ్వరుఁగాఁ దలంచుచున్. 6

ఉ. దాని సుభద్రఁగా నెఱిఁగి
దక్షిణ జాత మనోజ సంచల
న్మానసుఁడైన యవ్విజయు
మానుగఁజూచి మునీంద్రనీకుఁ జ
న్నె సలినాక్షులందు మది
నిల్పఁగనంచును మందహాస గ
ర్భాననుఁడై రథాంగధరుఁ
డాతని కిట్లనిమొం బ్రియంబునన్. 7

నీవు సుభద్రయందు బద్ధస్నేహుండవగుట తొల్లియు నే నెఱుంగుదు నోడకుండుము. నీకోర్కి వసుదేవ దేవకీ దేవులకుం జెప్పి సఫలంబు సేసెదనని యర్జునునకు హృదయానందంబుగాఁ బలికి యప్పుడ వడిగల చారుల రావించి ద్వారవతి యం దర్జునుం డున్నవాఁడని ధర్మరాజున కెఱింగించి రండని యింద్రప్రస్థపురంబునకుం బంచియున్నంత నచ్చటికి బలదేవాది యాదవు లతి భక్తులై వచ్చి యతియకావగచి యర్జునునకు నమస్కరించి యాతని వలన సర్వతీర్థకీర్తనంబులుఁ దత్సేవా ఫలంబులును విని సంతసిల్లి యువర్షాకాలంబున నస్మత్పురం

బున చాతుర్మాస్యంబు సేసి మమ్ముం గృతార్థులం జేయుండని ప్రార్థించి యప్పార్థుం దోడ్కొని చని వానికి నన్నపానాది విధులం బరిచరింప సుభద్రం బంచి కన్యాంతఃపురంబునందు నివాసంబు సేసి,

క. అందు ధృతిమందరుండు పు
రందర నందనుఁడు దనకు రమ్యగుణ శ్రీ
సుందరి సుభద్ర నెయ్యం
బొందఁగఁ బరిచర్య సేయుచుండఁగ నుండెన్. 8

క. ధీరుఁడు యతిరూపంబున
నారఁగ నిందున్నయాతఁ డర్జునుఁడని స
త్యా రుక్మిణులకుఁ జెప్పె ము
రారాతి రహస్యమున ననంతప్రీతిన్. 9

చ. అలయక నాఁటి నాఁటికి
లతాంగి యపూర్వములైన భోజనం
బులు గడుభక్తిఁ బెట్టుచు
నపూర్వములైన వపుర్విలాస యు
క్తులు వెలయించుచున్ ముద
ముతోఁ బెనిచెన్ మరు నాఁటి నాఁటి క
గ్గలమగుచుండ నెయ్యము
ను గామవికారము సవ్యసాచికిన్, 10

మఱియును,

సీ. అలినీలకుంతలుం డనియును హరినీల
సమవర్ణుఁడనియు నాజానులంబి
తాయత స్థిరబాహుఁ డనియును రక్తాంత
నలినదళాకార నయనుఁడనియు
నుత్తుంగ ఘనవిశాలోరస్కుఁ డనియును
గప్పడియనియును గరము వేడ్క
విశ్వచ్ఛు నెప్పుడు వినియుండునది దన
విననట్లు యతిఁజూచి వీఁడు విజయుఁ
డౌకొకో యనుచు సంశయోపేతచిత్తయై
యుండియుండ నోపకొక్కనాఁడు
భోజనావసానమున నున్న యమ్మౌని
కిట్టులనియెఁ బ్రీతి నిందువదన. 11

మునీంద్రా మీరాడని తీర్థంబులును మీచూడని పురంబులును మీరెఱుంగని రాజులును లేరని విచారింతు,

సీ. అమరావతికి నెనయనఁగ నివ్వసుమతి
బరఁగు నింద్రప్రస్థపురవరంబు
జూచితిరే పాండుసుతు లందు సుఖమున్న
వారె? మాయత్త యంభోరుహాక్షి
కుంతీమహాదేవి కుశలినియే? మహా
వీరుఁ డర్జునుఁడు జితారి తీర్థ

గమనోన్ముఖుండయ్యెఁ గ్రమ్మఱివచ్చె నే?
యెఱుఁగుదు రేని నాకెఱుఁగఁ జెప్పఁ
డనిన నేనచూపె యయ్యర్జునుండ నీ
యొద్ద నివ్విధమున నున్నవాఁడఁ
దరుణి నీకు నాకు ధరణీధరుండను
జలజభవుఁడు సేసె సంగమంబు. 12

బ్రాహ్మంబు మొదలుగాఁగల యెనిమిది వివాహంబులం దును గాంధర్వరాక్షసంబులు క్షత్త్రియులకు నుత్తమ వివాహంబులు గావున నిది గాంధర్వవివాహంబునకు సమయం బనిన సుభద్ర లజ్జావనతవదనయై యిట్లనియె.

తే. నన్ను నీ నర్హులెల్ల నిందున్నవారు
వార యెఱిఁగి చేయుదురు వివాహమనుచు
వనజనేత్ర యంతఃపురంబునకుఁ జనియె
నరిగెఁ దనలతాగృహమున కర్జునుండు. 13

అయ్యిరువుర యన్యోన్యప్రణయంబులు దన దివ్యజ్ఞానంబున దివ్యపురుషుండైన పురుషోత్తముం డెఱింగి యర్జునునకు భోజనవిధు లొనర్ప రుక్మిణీదేవిం బనిచి యొక్కనాఁడు దేవకీ వసుదేవ ప్రద్యుమ్న సాంబ సంకర్షణ సారణ సాత్యకులకు నర్జునస్థితియు నాతనియందు సుభద్ర నెయ్యంబును నెఱింగించినఁ దమ తొంటివిచారంబున కనురూపంబగుటకు సంతసిల్లి బలదేవాదులెఱుంగకుండ సుభద్రార్జునులకు వివాహంబు

సేయ నిశ్చయించి తమ నిశ్చయం బయ్యిరువురకుం జెప్పి పశుపతి పూజామహోత్సవ వ్యాజంబున నఖిల యాదవ భోజాంధక వృష్ణివరులతో నంతర్ద్వీపంబునకుం జని,

క. అందమర బృంద వంద్యున
కిందు కళాభరణునకు నుమేశ్వరునకు నా
నందంబందఁగ నందఱు
నందకధరు డుత్సవంబొనర్పఁగఁ బంచెన్. 14

క. తగఁగ వివాహం బెన్నం
డగునో కో యెన్నండు సంగమావాప్తియు మా
కగునో కో యని యెదఁగోరుచు
నొగి నిటనుండిరి సుభద్రయును విజయుండున్. 15

క. హరిఁదలఁచె సుభద్ర పురం
దరుఁ దలఁచె ధనంజయుండు దడయక వార
య్యిరువురఁ బెండిలి సేయఁగ,
వరదులు తద్ద్వారవతికి వచ్చిరి ప్రీతిన్. 16

ఇట్లు వాసుదేవుండు వసుదేవాక్రూర సారణ సాంబ సాత్యకి సహితుండై యంతర్ద్వీపంబుననుండి వచ్చిన యనంతరంబ యమరావతినుండి యమర సిద్ధ సాధ్య మునిగణ పరివృతుండై యమరేంద్రుండు వచ్చె నంత బృహస్పతి నిశ్చయించిన శుభలగ్నంబున నగ్ని యమ నిరృతి వరుణ వాయు ధనదేశానాది సురవరులు నత్రి భృగు భరద్వాజ నారద వసిష్ట

వామదేవ ప్రభృతులయిన మహామునులు సదస్యులుగాఁ గశ్యప ప్రజాపతి హోతగా నరుంధతియు శచియు సత్యభామయు రుక్మిణియు నప్సరోగణంబులతోడం బురంధ్రీకార్యంబులు సేయ సుభద్రార్జునుల వివాహం బతి రమ్యంబయ్యె.

మాలిని. నరునకు దయనిల్లానందమొందించి యింద్రుం
డరిగెదివికి దివ్యానంత రత్నాంశు జాల
స్ఫురిత సురవిమానంబుల్ నభోభాగ మెల్లన్
నెరసి వెలుఁగు చుండన్ నిర్జరశ్రేణితోడన్. 17

ఇట్లు నారాయణుండు నిజారంభంబు సఫలంబగుటకు సంతసిల్లి సంప్రాప్తమనోరథుండయిన యప్పార్థుం గౌఁగిలించుకొని యక్షయ బాణతూణీర బాణాసన సనాథంబయి పవన జవంబులైన హయంబులం బూన్చిన కాంచనరథం బెక్కి సుభద్రం దోడ్కొని యింద్రప్రస్థపురంబున కరుగుమని పంచి యనంతరంబ జనార్దనుం డంతర్ద్వీపంబున కరిగిన,

క. హరి పంచిన మార్గంబునఁ
గురువిభుఁడు సుభద్రఁ దోడుకొని చనునెడఁ ద
త్పుర పరిరక్షకు లతి భీ
కరులు పృథుశ్రవసుఁడాదిగాఁగల వీరుల్. 18

ఉ. వీరుఁడు వీఁడు పాండవుఁడు
వృష్ణికులోత్తములైన సీర్కిదై
త్యారు లెఱుంగకుండఁగ మ
హారథుడై తరుణిన్ సుభద్ర నం

భోరుహనేత్రఁ దోడ్కొనుచుఁ
బోయెడు నీతనిఁ బోవనిచ్చినన్
ధీరుఁడు మాధవుండు బల
దేవుఁడు నల్గుదురంచు నడ్డమై. 19

క. ఏఁక బఱతెంచి నల్గడఁ
దాఁకినఁ గడునగ్గి ఘోరతర శరహతి న
మ్మ్రాఁకలు విరియఁగ నర్జును
డాఁకగొనక యేసె నుగ్రుఁడయి రణభూమిన్. 20

చ. హరితనయుండు పార్థుఁడు ర
యంబున నందఱ నాహవక్రియా
విరహితులఁ జేసి యప్పురము
వీథుల వేదులరమ్యహర్మ్య గో
పురములఁ దగ్గిరింద్రమణి
భూముల భూరితటాక పంకజా
కర నవనందనావళులఁ
గాండమయంబులఁ జేసె నీసునన్. 21

క. అమరేంద్రసుతుఁడు దనకుం
గమలాక్షి సుభద్ర రథము గడపఁగ ననిలో
నమితయదుసైన్యముల న
క్రమమున నోడించి లబ్ధజయుఁడయి యరిగెన్. 22

—నన్నయభట్టు

# 4. అస్త్రవిద్యాసందర్శనము

కృతాస్త్రశస్త్రులయిన రాజకుమారుల విద్యాకౌశలంబు వ్యాస గాంగేయ విదుర కృప శల్య శకుని సోమదత్తాదుల సమక్షంబునం జూప సమకట్టి యొక్కనాఁడు ద్రోణుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

క. ఘోరాస్త్రశస్త్రవిద్యల
నారూఢత మిగుల నిపుణులైరి కుమారుల్
మీరలు వీరల విద్యా
పారము చను తెలియఁగవలయు భవదీయ సభన్. 1

అనిన నట్ల చేయుదునని ధృతరాష్ట్రుండుఁ గుమారుల విద్యాసందర్శనరంగంబు రమ్యంబుగాఁ జేయింపుమని విదురుఁ బంచిన నతండు వల్లెయని శాస్త్రోపదిష్ట ప్రమాణోపేత వృత్తాయతంబును, నపాకృత వృక్ష గుల్మ వల్మీకంబును, నంగీకృత పూర్వోత్తరప్లవంబును, సమీకృత నిమ్నోన్నత ప్రదేశంబును, దూరీకృత కంటక పాషాణ శల్య శకలంబును, విరజీకృత రజోధూసర స్థలంబును, విరచిత బహువిధ ప్రేక్షాగార మంచకప్రపంచంబును, నానాధ్వజ నవపల్లవ రంభాస్తంభమాలాలంకృత ద్వార తోరణంబును, బ్రతిదిశా నిర్వర్తిత శాంతిక బలివిధానంబునుంగాఁ జేయించి పంచాంగ

శుద్ధదినంబున సుముహూర్తంబున ధృతరాష్ట్రుండు గాంధారీ పురస్సర దేవీశతపరివృతుండై వివిధభూషణ భూషితానేక విలాసినీ నివహంబుతోఁ జనుదెంచి, విలంబిత కదంబస్థూల ముక్తాఫలచామరమణీయంబై, యాబద్ధమరకత వజ్రవైడూర్య పద్మరాగ ప్రవాళ ప్రభానికర వ్యతికర విరచితాపూర్వ సుర చాప చారు గౌరవంబై యతిమనోహరంబైన శాతకుంభ మయ ప్రేక్షాగారంబున నున్న,

తే. అంతఁ గరమొప్పి సుందరీబృంద మఖిల
రత్నరాజిత కనక ధరాధరేంద్ర
కందరాంతరమున నున్న సుందరాప్స
రోంగనాబృందంబు ననుకరించె. 2

తే. సుతుల విద్యాప్రవీణతఁ జూచువేడ్క
నెంతయును సంతసంబునఁ గుంతిదేవి
రాజసన్నిధి గాంధార రాజపుత్రి
కెలననుండె సుస్మిత నలిన నేత్ర. 3

సీ. వ్యాసపురస్కృతావని దేవనివహంబుఁ
గృప శల్య శకుని గాంగేయ విదుర
సోమదత్తాది భూసుర గురుబాంధవ
మిత్రవర్గంబు నమేయ మంత్రి
సామంత మండలేశ్వర సమూహంబును
గాయక వైతాళిక ప్రవరులుఁ

దమశమ నియమవ్రత ధ్యానంబులందోలి
నుండిరి బోధన నులిసె భేరి

ఆ. లస్త్రదర్శనాగతాఖిల క్షత్రియ
వైశ్య శూద్ర వివిధ వర్ణజనుల
కలకలంబు ప్రళయకాలసంక్షోభితాం
బోధి నిస్వనంబుఁబోలెఁ జెలఁగె. 4

అట్టి యవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణ మాల్యానులేపన యజ్ఞోపవీత పలితశ్మశ్రుకేశ కలాపశోభితుండు రంగమధ్యంబున నశ్వత్థామసహితుండై విముక్తజలధర వియన్మధ్యంబున నంగారసహితుండైన యాదిత్యుండునుం బోలె నున్నసగణ్య భూసురవరేణ్య పుణ్యాహవాచనానంతరంబున,

శా. ద్రోణాచార్యు పిఱుందనొప్పి దృఢహ
స్తుల్ బద్ధగోధాంగుళి
త్రాణుల్ మార్గణపూర్ణతూణులు మహా
ధనుర్వల్లిభూషుల్ దను
త్రాణోపేతులు రంగమధ్యమున సం
తన్ నిల్చి రుద్యద్గుణ
శ్రేణీరమ్యులు ధర్మజప్రముఖులై
జ్యేష్ఠానుపూర్వంబుగాన్. 5

ఇట్లు నిలిచి యాచార్యు ననుమతంబున.

సీ. అసివర్మకౌశలం బమరంగఁ జూపెడు
వారును దృఢసౌష్టవంబులొప్పఁ
దమ తమ నామాంకితములైన శరముల
నేర్పడఁ లక్ష్యంబు లేయువారు
హయమదద్విరద రథారూఢదక్షతఁ
బ్రకటించువారునుఁ బ్రాసశక్తి
కుంతతోమరగదా కుశలత్వ మెఱిఁగించు
వారునుగా నిట్లు వసుధలోన

ఆ. రాజసుతులతోడ రమణఁ బాండవ ధృత
రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దఁ
దద్దముదనుతోడఁ దమ తమ నేర్పుల
మెఱసిరెల్లజనులు మెచ్చిపొగడ. 6

అంత ననంతబలపరాక్రములగు భీమ దుర్యోధను లుద్యద్గదాహస్తులయి, మహామత్సరంబుతో, నేకశృంగ సముత్తుంగ శైలద్వయంబు ననుకరించుచు, వశానిమిత్త క్రుద్ధ గంధ సింధురంబులుంబోలె నొండొరులం దాఁకుచు, సవ్యాపసవ్య చిత్ర మండలమార్గంబుల గదాకౌశలంబు మెఱయునెడ,

మ. అవనీచక్రము పాదఘాతమున న
ల్లాడంగ నత్యుగ్ర భై
రవ హుంకారరవంబునన్ వియదగా
రంబెల్ల భేదిల్లఁ బాం

డవ కౌరవ్యగదా విఘట్టన మకాం
డ ప్రోత్థమై భావి పాం
డవ కౌరవ్యరణాభిసూచన పటి
ష్ఠంబయ్యె ఘోరాకృతిన్. 7

క. ఆరాజసుతుల విద్యా
పారగ పటుచేష్టితములఁ బరువడి నగ్గాం
ధారీ ధృతరాష్ట్రుల కతి
ధీరుఁడు విదురుండు సెప్పి తెలుపుచునుండెన్. 8

అంత భీమ దుర్యోధనుల గదాకౌశలంబు సూచు జనంబుల పక్షపాతవచనంబులు విని ద్రోణుండు రంగ భంగ భయంబున నశ్వత్థామం బంచి వారినిద్దఱ వారించి వారాశి యుంబోలె ఘోరన మ్రోగుచున్న వాదిత్రశబ్దంబు లుడిగించి నా ప్రియ శిష్యుండయిన యర్జును ధనుర్విద్యాకౌశలంబుఁ జూడుండనిన నయ్యార్యు వచనానంతరంబున,

ఉ. హారి విచిత్ర హేమ కవ
చావృతుఁ డున్నత చారుచాప దీ
ర్ఘోరుభుజుండు, భాస్వదసి
తోత్పలవర్ణుఁడు నైంద్రచాప శం
పారుచి మేఘమో యనఁగఁ
బాండవమధ్యముఁ డొప్పె బద్ధ తూ
ణీరుఁడు రంగమధ్యమున
నిల్చి జనంబులు దన్నుఁజూడఁగన్. 9

క. నరు నింద్రాత్మజు నింద్రా
వరజ సఖున్ వీరుఁ బాండవ ప్రవరు ధను
ర్ధరుఁ జూచి చూప తెల్లం
బరమాద్భుతచిత్తులగుచుఁ బలికిరి దమలోన్. 10

తే. వీఁడె, కృతహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందు
వీఁడె, యగ్రగణ్యుఁడు ధర్మవిదులలోన
వీఁడె భరతవంశంబెల్ల వెలుఁగఁ గుంతి
కడుపు సల్లఁగాఁ బుట్టిన ఘనభుజుండు. 11

క. అని పలుకు జనుల పలుకులు
విని కుంతి యనంతహర్ష విస్తారిత లో
చనయై నందను నృపనం
దన సంఘములోనఁ జూచి తద్దయుఁబొంగెన్. 12

క. చారు మనస్సమ్మద రస
పూరము వెలివచ్చినట్లు పొలఁతికి విగళ
ద్భూరి స్తనజనిత పయో
ధారలు నానందబాష్పధారలు నొప్పెన్. 13

అయ్యర్జును స్తుతివచనంబు లొక్కట జనసంఘంబు వలన నెగసి వియత్తల విదళనంబయిన నమ్మహాధ్వని విని యదరిపడి ధృతరాష్ట్రుం డిది యేమిరవంబని విదురు నడిగిన నతం డిట్లనియె.

క. భూరిభుజుం డర్జును డతి
శూరుఁడు దన యస్త్రవిద్యఁ జూపఁగ రంగ
త్ప్రారంభుఁడయిన నతనిన్
వారక వర్ణించు జనరవంబిది యధిపా. 14

క. అనవుడు ధృతరాష్ట్రుఁడు దన
మనమున సంతోషమంది మానుగవీనుల్
గనిన ఫల మిపుడ గంటిని
వినఁగల్గెను బాండుసుతుల విద్యాశక్తుల్. 15

క. భూరినిజద్యుతితోడఁ బ్ర
ధారణి సంభూత పాండవాగ్ని త్రితయం
బారఁగ నస్మత్కులదురి
తోరుతరారణ్యదాహ మున్నతిఁ జేయున్. 16

అని పొగడుచుండ నర్జునుం డాచార్యు ననుమతంబున నస్త్రలాఘవ విచిత్ర ప్రకాశన పరుండయి యెల్లవారును జూచుచుండ,

సీ. ఆగ్నేయశరమున నతిభీకరాగ్నియు
వారుణాస్త్రమున దుర్వారజలము
ననిలబాణంబున నధికానిలంబును
మేఘాస్త్రమున మహా మేఘచయముఁ
బుట్టించుమఱియును భూమిబాణంబున
భూప్రవిష్టుండగు భూరి ఘోర

శైలబాణంబున శైలరూపముదాల్చు
వీరుఁడదృశ్యాస్త్రవిద్య పేర్మిఁ
తే. దానదృశ్యదేహుండగుఁ దత్క్షణంబ
హ్రస్వుఁడగు దీర్ఘుఁడగు సూక్ష్ముఁడగు రయంబు
తోడఁ రథమధ్యగతుడగుఁ దురగగతుఁడు
నగు మహాగతుఁడగు నిట్టు లద్భుతముగ. 17

మఱియుం బాఱెడు సింహవ్యాఘ్రవరాహాది ముఖంబులం దొక్కొక్క యమ్మేసినట్లే నమ్ము లతి లాఘవంబున నేసియు, రజ్జుసమాలంబితంబైన గోశృంగంబునం దేకవింశతి శరంబులు వరుస నాఁట నేసియు, నిట్లస్త్రవిద్యావైచిత్ర్యంబు మెఱసి, గదాఖడ్గాది వివిధాయుధ దక్షతంజూపి యర్జునుండు జనుల కాశ్చర్యంబు సేయుచున్నంతఁ గర్ణుండు నిజవిద్యా కౌశలంబు మెఱయ సమకట్టి వచ్చి రంగద్వారంబున భుజా స్ఫాలనంబు సేసిన,

మ. జనులెల్లం గడు సంభ్రమింపఁగ నజ
స్రంబై భుజాస్ఫాలన
ధ్వని శైలప్రకరంబుపైఁబడు మహా
దంభోళి శబ్దంబొకో
యన వీతెంచినఁ బాండవుల్ సనిరి ద్రో
ణాచార్యుడాయర్ సుయో

ధను వేష్టించిరి తమ్ములందఱును ద
ద్ద్వారంబు నిక్షించుచున్. 18

శా. సాలప్రాంశు, నిజోజ్జ్వల త్కవచు, శ
శ్వత్కుండలోద్భాసితున్
బాలార్కప్రతిమున్, శరాసనధరున్,
బద్ధోగ్రనిస్త్రింశు, శౌ
ర్యాలంకారు, సువర్ణవర్ణధరుఁ, గ
ర్ణాఖ్యున్ఁ జగత్కర్ణ పూ
ర్ణాలోలద్గుణుఁజూచి చూపఱు ప్రభూ
తాశ్చర్యులై రచ్చటన్. 19

అంతఁ గర్ణుండు జనులసందఱు నదల్చి, బొత్తెంచి, రంగమధ్యంబున నిలిచి కలయంజూచి కృప ద్రోణులకు నమస్కరించి, సజలజలధరధ్వాన గంభీరవచనంబుల నర్జును నాక్షేపించి యిట్లనియె,

క. నీవ, కడు నేర్పుకాఁడవు
గా వలవదు వీనిఁ గొన్ని గఱచితిమే మున్
నీ విద్యలెల్లఁ జూపుదు
మేవీరులు సూచి మేలు మేలని పొగడన్. 20

క. అనిన నినతనయు పలుకులు
జనులకు విస్మయము సవ్యసాచికిఁ గోపం

బును సిగ్గును మఱి దుర్యో
ధనునకుఁ బ్రీతియును జేసెఁ దత్ క్షణమాత్రన్. 21

అంత ద్రోణుచేత ననుజ్ఞాతుండయి కర్ణుం డర్జునుండు సూపిన యస్త్రవిశేషంబులన్నియు నశ్రమంబునఁ జూపినఁ జూచి, దుర్యోధనుండు దానుం దమ్ములును గర్ణునిం గౌఁగలించుకొని నాతో బద్ధసఖ్యుండవయి నాకును బాంధవులకును హితంబుసేసి నా రాజ్యభోగంబుల నీవును నుపయోగింపు మనినఁ గర్ణుం డందుల కొడంబడి యిమ్మూఁగిన రాజలోకం బును నీవును జూడ నర్జునుతో ద్వంద్వయుద్ధంబు సేయవలయు ననిన ధార్తరాష్ట్రమధ్యంబున నున్న యక్కర్ణుంజూచి పార్థుం డిట్లనియె.

క. పిలువంగఁబడక సభలకు
బలిమింజని పలుకు పాపభాగుల లోకం
బులకుఁ జనవేఁడి పలికెదు
పలువ! యెఱుంగవు పరాత్మ పరిమాణంబుల్. 22

క. అనిన విని పార్థునకు ని
ట్లనియె నినాత్మజుఁడు దుర్బలాశ్రావ్య సాక్షే
ప నిబంధనములు వలుకకు
ఘననిశితాస్త్రములఁ బలుకఁ గడఁగుము నాతోన్. 23

క. ఈ రంగభూమి యస్త్రవి
శారదులగువారికెల్ల సామాన్యముగా

కారయ వీరికిఁ జననగు
వీరికిఁ గాదను విచారవిషయముగలదే. 24

అని గర్వించి దుర్యోధనానుమతంబునఁ బార్థుతోఁ ద్వంద్వయుద్ధంబు సేయంబూని రణసన్నద్ధుండయి రవితన యుండు రంగమధ్యంబున నున్నంత, నర్జునుండును నాచార్య భ్రాతృచోదితుండై యుగాంతకాలానలుండునుంబోలెఁ బ్రతి ఘటించి నిలిచిన,

మ. జనితామర్షణుఁడంతఁ బార్థుపయిఁ బ
ర్జన్యాస్త్ర మకర్ణుఁ డే
సిన ఘోరంబయి భూనభోంతరముఁ ద
జ్జీమూతయూథంబు గ
ప్పినఁ దద్ధ్వాంతతిరోహితాపఘనుఁడై
భీభత్సుఁ డుండెన్ విరో
చనుఁ డాత్మద్యుతి విస్తరించె సుతుపై
సంప్రీతచేతస్కుఁడై. 25

అయ్యవసరంబున దుర్యోధనుం దొట్టి ధృతరాష్ట్ర నందను లందఱు గర్ణువలన నుండిరి. భీష్మ ద్రోణ కృపపాండవులు పార్థువలన నుండిరి. అంత,

క. రవిసుత పార్థుల ఘోరా
హవమునకును వెఱచుచున్నయది కుంతియుఁ ద

ద్రవిభవ ఘనశర తిమిరౌ
ఘ వృతాంగుఁ దనూజుఁ జూడఁగానకవంతన్. 26

క. ధృతిదఱిఁగి మోహ మూర్ఛా
న్వితయై నను సంభ్రమించి విదురుఁడు ప్రత్యా
గత జీవఁజేసె నప్పుడ
యతిశీతల చందనోదకాసేకమునన్. 27

అంత నర్జునుం డనిలబాణంబున నమ్మేఘపటలంబు పఱవఁజేసిన నాదిత్యసమానులయి యెదురదర్శితులై యున్న యకర్ణార్జునులం జూచి కుంతి సంతసిల్లె నపుడు ధర్మవిదుం డఖిలద్వంద్వయుద్ధ సమాచార నిపుణుండైన కృపాచార్యుం డయ్యిద్దరనడుమ నిలిచి కర్ణున కిట్లనియె,

చ. కురుకులజుండు, పాండునకుఁ
గుంతికిఁ బుత్త్రుఁడు, రాజధర్మ బం
ధురచరితుండు, నీ వితని
తోఁడ రణంబొనరించెదేని వి
స్తరముగ నీదు వంశమును
దల్లిని దండ్రిని చెప్పు, చెప్పినన్
దొరయగునేని నీ కెదిరి
దోర్బలశక్తి నితండు సూపెడున్. 28

అనిన విని కర్ణుండు దన కులంబును దల్లిదండ్రులను జెప్ప సిగ్గువడి తల వాంచియున్నంజూచి దుర్యోధనుండు గృపున కిట్లనియె,

క. దీనికి సదృశముగా మఱి
యేనేమియొనర్తు నీకు నిష్టంబనినన్
మానుగ నాతోఁ జెలిమి మ
హీనుతముగఁ జేయుమిదియ యిష్టము నాకున్. 32

అనిన విని దుర్యోధనునకు సంతోషంబుగాఁ గర్ణుం డతనితోడ నిష్టసఖత్వంబున గొడంబడియుండె నంతఁ గొడుకు రాజ్యాభిషేకోత్సవంబు సూచి హర్షపరవశుండయి సూతుండు రథంబుడిగ్గి కర్ణునొద్దకుం బఱతెంచుచున్న నతండును బితృగౌరవంబున సంభావించి, వినయవినమితోత్తమాంగుండయిన,

తే. కడఁగి సూతుండు పుత్త్రకుఁ గౌఁగిలించి
కొని తదీయ మూర్ధాఘ్రాణ మొనరఁజేసి
యంగరాజ్యాభిషేకార్ద్రమైన శిరముఁ
దడిపె వెండియు హర్షాశ్రుతతులనొప్ప. 33

దానిం జూచి భీముండు కర్ణుని సూతకుల సంభవుంగా నెఱింగి నగుచు నిట్లనియె.

క. నీదు కులమ్మునకుఁ దగఁ బ్ర
తోదముఁగొని రథము గడపఁ దొడఁగుము నృప ధ
ర్మోదయుఁడగు నర్జునుతోఁ
గాదనక రణంబుసేయఁగా నీకగునే. 34

మఱి యదియునుంగాక,

తే. ఉత్తమ క్షత్త్రియ ప్రవరోప యోగ్య
మైన యంగరాజ్యంబు నీకర్హ మగునె
మంత్రపూతమై గురుయజమాన భక్ష్య
మగు పురోడాశమది కుక్క కర్హమగునె. 35

అనిన విని కర్ణుండు వెల్లనయి యెద్దియుం జేయునది నేరక దీర్ఘోష్ణనిశ్వాస వ్యాకులవదనుండయి యాకాశంబున నున్న యాదిత్యుం జూచుచు మిన్నకుండె. అంత నతిప్రీడితుం డయిన యక్కర్ణుంజూచి భ్రాతృ పద్మ వన మధ్యంబుననుండి దుర్యోధన మదాంధ గంధ సింధురంబు వెలువడి వచ్చి కడు నలిగి భీమున కిట్లనియె.

క. అనిలజ నీకిట్లని ప
ల్కను జనునే తలఁప లేడికడుపునఁ బులి పు
ట్టునె యిట్టి దివ్యతేజం
బునవాఁ డధమాన్వయమునఁ బుట్టునె చెపుమా. 36

సీ. శూరులజన్మంబు సురల జన్మంబును
నేఱులజన్మంబు నెఱుఁగంగ నగునె
మొగిని దధీచి యెమ్మునఁ బుట్టదయ్యెనే
వాసవాయుధమైన వజ్రమదియు
గాంగేయుఁడన మఱికార్తికేయుండన
నాగ్నేయుఁడన రౌద్రుఁడనఁగ శరవ

ణోద్భవుండన గుహుం డుద్భవిల్లఁడె శర
స్తంభజన్ముఁడుగాఁడె ధర్మవిదుఁడు
తే. కృపుఁడు ఘటసంభవుఁడుగాఁడె కీర్తిపరుఁడు
వరుఁడు ద్రోణుండు విప్రులవలనఁ బుట్టి
రైరె సత్క్షత్రియుల్ ఘను లవనిఁ గావఁ
గడఁగి మీజన్మములు నిట్టుగావె వినఁగ 37

వానితోఁడిదేమి; దివ్యలక్షణ లక్షితుండును సహజ కవచకుండలమండితుండునుంగాని, ప్రాకృతపురుషుండుగాఁడు. దనబాహుబలంబున నీయంగరాజ్యంబునక కాదు సకల మహీ రాజ్యంబునకు నర్హుండగు ననుచున్నయంత నాదిత్యుం డస్త గతుండయిన నస్త్రసందర్శనరంగంబు వెలువడి దుర్యోధనుండు గర్ణుందోడ్కొని కరదీపికాసహస్రంబులు వెలుంగ నిజమంది రంబున కరిగెఁ బాండవులును భీష్మ ద్రోణ విదుర కృపా చార్యులతో నిజనివాసంబుల కరిగిరి.

—నన్నయభట్టు

# 5. కురుసేన—ఉత్తరుఁడు



సీ. అభినవజలధర శ్యామంబులగు నెడ
లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోప మచ్ఛాయంబులగుపట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజ మరాళ గౌరంబులై తగుచోట్లు
దఱచుఁ బూఁబొదల చందంబునొంద
హారిద్రరుచి సమానాకృతులగు తావు
లడరెడు పుష్పాదులట్లు మెఱయఁ
తే. గలయనెగసి ధరాధూళి లలితవనము
దివికి నలిఁగొఁపుపోయెడు తెఱఁగుదాల్ప
గోగణము మ్రుంగలిగ నేల గోడివడఁగ
నడచు కౌరవరాజు సైన్యంబుఁగనియె. 1

క. కని యుత్తరుండు గరుపా
ఱిన మేనును దలఁకుమనమ్ము రిచ్చవడిన చూ
పునునై శోత్రుపడుచు ని
ట్లనియె దిగులుపొచ్చి యా బృహన్నలతోడన్. 2

శా. భీష్మ ద్రోణ కృపాది ధన్వినికరా
భీలంబు మహోగ్ధన

గ్రీష్మాదిత్య పటు ప్రతాప విసరా
కీర్ణంబు శస్త్రాస్త్ర జా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలా
త్యుగ్రంబు దగ్రధ్వజా
ద్భిష్మత్వాకలితంబు సైన్య మిదియేఁ
జేరంగ శక్తుండనే. 3

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా
ర్ముక విద్యాప్రౌఢిమై నిరూఢులయిన యీ
శకుని జయద్రథ దుర్ముఖ
వికర్ణ కర్ణాదియోధవీరుల కెదురే. 4

క. ఇట్టగు టెఱుఁగక వచ్చితి
మెట్టొకొ మనభంగి వీరలిందఱును గడున్
బెట్టిదులు మనకు మార్కొను
నట్టి కొలదిగాదు భీతియడరెడుఁ దోఁత్రోన్. 5

ఉ. కౌరవసేనఁ జూచి వడ
కం దొడఁగెన్ మదిలోన మేను నీ
వూరకపోవుచున్కి యిది
యొప్పునె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరలనేను, మార్కొనమి
నిశ్చయ మట్లగుటన్ రయంబునన్

దేరు మరల్పు ప్రాణములు
దీపన మున్నవె బృహన్నలా. 6

అనిన దరహాసితవదనుండగుచు శతమఖతనయుం డతని కిట్లనియె,

చ. అసదృశలీలఁబోల్చు రథి
కావలిమీఁదఁ జనంగ నెక్కనే
మసలక యామిషంబుఁగొని
మార్గమువట్టిన తుచ్ఛసైన్యముల్
వెసఁజని ముట్టి గోధనము
వేగ మరల్తునుగాక యిమ్మెయిం
బసులటుపోవఁగా మతలఁ
బాడియె నీకు నరేంద్రనందనా. 7

ఉ. అంతిపురంబులోనఁ గల
యంగనలెల్లను నెమ్మనంబులన్
సంతసమందఁగా బసుల
జయ్యనఁ దెచ్చెదనంచుఁ బూని నీ
వెంతయు మేటివై యరద
మెక్కి రయంబునవచ్చి యిచ్చటన్
దంతి తురంగ సద్భట క
దంబముఁ జూచి కలంగుటొప్పునే. 8

ఆ. అనిన పలుకులకు బృహన్నలఁ గనుఁగొని
యెలుఁగుసడఁగ నాత డిట్టులనియెః
బసుల దయ్యెమెఱుఁగు బడఁతుల సంతోష
మేల నాకు ననికి జాలనేను. 9

అనవుడు,

చ. తన భుజశక్తియున్ రిపుల
దర్పము నేర్పడఁ జూచి చూచి యి
ట్లును చెగకున్నఁ బోక యిది
లోకము చక్కటి శూరులైన దీ
నిని మది మెచ్చ రీ బలము
నీదెసఁ దేఱియుఁ జూడ దింతకున్
మును భయహేతువైన విధ
ముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్. 10

సీ. చెసలుబీఁటలువార దివురుచిందముల కో
లాహలంబులకుఁ గలంగఁబడక
యురవడి సేనలు చెరలఁ బైఁదోతెంచు
ధూళి పెల్లడరినఁ దూలపోక
చతురంగబల మతి సాంద్రతఁ గవిసిన
యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథి వర్మాంగ
తతినాఁటు తఱచునఁ దల్లడిలక

తే. బహువిధంబులఁ బగతుర బరవసమున
నిత్తెఱంగునఁ గలుగు క్రందెల్లనోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁగాక
దవ్వు దవ్వుల విఱిగిన నవ్వరెట్లు. 11

చ. అను దివిజేంద్రనందనున
కమ్మనుజేశ్వర సూనుఁ డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు
విక్రమసంపద సొంపుమీఱ గో
ధనములఁ బట్టినం బతి యు
దగ్రత సైన్యములెన్ని యన్నియున్
గొని యటఁబోయెఁ గాన మన
కుం బురి బాసటలేర యెవ్వరున్. 12

తే. ఒంటి దలపడి కురుసేన నోర్చువాఁడ
నే యిదేటికి వెడమాట లిట్టులాడ
వారు గానక ముందఱ తేరుదోలు
కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి. 13

అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె.

క. వెగడొంది యిట్లు వలుకఁగ
నగు నే పగతురు ప్రమోదమందఁగఁ బసులన్
దిగవిడిచి పురజనంబులు
వెగడంగా మగిడిపోక దీనతగాదే. 14

అట్లుంగాక,

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దా
నం బెంపుమై బిల్చి తో
డని తోడ్తెచ్చితివీవు బంటుతన మ
ట్లగ్గించి పోరాలి దీ
వన లిచ్చెం దుదిఁబోయి కౌరవులు గో
వర్గంబుఁ గొంపోవఁగాఁ
గనియే గ్రమ్మఱి రిత్తవోదునె భయో
త్కంపంబు నీ కేటికిన్. 15

తే. చిత్తవృత్తి రొక్కించుక చిక్కఁబట్టు
మిపుడ కౌరవసైనికులెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమునులావు వెరవు మెఱయఁ
గదుపు బెట్టించి శోదము గ్రమ్మఱింగ. 16

అనుచు విప్పచ్చుండు గడంగి తేరు వోవనిచ్చుటయు నాననంబు పల్లటిల్ల మానసంబు దల్లడిల్ల నా భూవల్లభకుమారుండు,

క. దవ్వుల విరిగినఁ బారులు
నవ్వుదురౌ మేలుమేలనను నాఁగకు నీ
క్రొవ్వఱుగదేని దలపడు
మెవ్విధిఁ జనితేమియనుచు నెత్తిన భీతిన్. 17

క. శరములు శరాసనము న
య్యరదముపై డిగ్గవిడిచి యతి రభసమునన్
ధరణికి లంఘించి వెసన్
బురిదెసకును లజ్జవిడిచి పోవంబారెన్. 18

ఇట్లువారినం దనమనంబునం గుత్సించుచు భీభత్సుండు యుగ్యంబుల పగ్గంబులు నొగలముడిచి రథంబుడిగ్గ నురికి లంబకేశభారుండును నాందోళిత రక్తాంబరయుగ లాంఛనుం డును నగుచు నతనివెనుక శుండాల రయలీలాసమద రేఖంబగు గమనంబునం బఱచి పద శతమాత్ర ప్రదేశ పలాయితుండగు భూమింజయు నెఱిఁడి పట్టుకొనిన నతండు,

సీ. వెలవెలఁబాఱుచు వెగడొంది పెదవుల
తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబులెల్ల నిండఁ జెమర్చుఁ
బదములు గరములు గుదివడంగ
హృదయంబు దటతట నదరంగఁ బెలుకుఱు
దీనదృష్టుల మోము దేఱిచూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిలనేడ్చు విడుమని
ప్రార్థించు మాట గీడ్పాటుదోఁప

తే, నిష్కశత శుద్ధహేమంబు నిర్మలోజ్జ్వ
లాష్ట వైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ

గరటిదశకంబు నొకయూరుఁ బురముసొచ్చి
నపుడ యిచ్చెద నీకను నార్తుడగుచు. 19

క. నాతోడి ప్రేముడిం గడు
నాతురయై యెదురుచూచు నంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయమ బోడ
నూతుం బోనీఁగదే విశుద్ధచరిత్రా. 20

అని మఱియు నానావిధ దీనాలాపంబులం బ్రార్థించు చుండం బార్థుండు నగుచు నతనిం దేరు సేరందెచ్చి,

చ. వెఱవకుమన్న పోటు కురు
వీరులతోడ నశక్యమేని న
త్తెఱఁగది యేల నీవుడుగు
తేరికి సారథిగమ్ము నాకుఁ జి
చ్చుఱ పిడుగొట్టులట్టడరి
శూరుల మొత్తము నుగ్గుసేసెదం
బఱపెదసేన రాజు ధృతిఁ
బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్. 21

క. అనుచు నొడఁబాటు లేకు
న్నను నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి తా
నును రథమెక్కి రథికుఁడయి
చనియె నరుఁడు జమ్మిసేర సమ్మదలీలన్. 22

—తిక్కన సోమయాజి

# 6. భీమసేన జరాసంధుల మల్లయుద్ధము



మ. సమసత్త్వాతిశయుల్ వృకోదర జరా
సంధుల్ మహోద్యత్పరా
క్రమ మొప్పం గడు నల్గి యొండొరులఁ జు
ట్టుందాఁకి రన్యోన్య దు
ర్దమదోర్దండ పటు ప్రహార జనిత
ధ్వానంబు బ్రహ్మాండ భాం
డము నిండన్ లయకాలదండధర చం
డక్షోభమోనాజనుల్. 1

క. కర్షితరిపు లన్యోన్యా
కర్షణ సంకర్షణాపకర్షణముల సా
మర్షులయి పెనఁగి రాహవ
హర్షంబునఁ బవనసుత బృహద్రథ పుత్త్రుల్. 2

క. వ్యాయామకర్కశ స్థిర
కాయుల యుద్ధము భయానకం బయ్యె మహో
గ్రాయ సపరిఘాయిత కఠి
నాయత భుజదండదారుణాఘాతములన్. 3

చ. అతులబలుల్ పరస్పర జ
యార్థులు పార్థివ పుంగవుల్ మరు

తృుత మగధేశ్వరుల్ సమర
శూరుల్ దారుణలీలఁబోరి రూ
ర్జిత భుజశక్తు లేర్పడఁగ
సింహగజేంద్రములట్లు వజ్రప
ర్వతములయట్లు ఘోరతర
వాసవవృత్రులయట్లు నిద్దఱుꣳ 4

ఇట్లు కార్తికమాసంబునం బ్రథమదివసంబునం దొడంగి భీమ జరాసంధు లెడయుడుఁగక యొండొరులం బట్టియుఁ గిట్టియు నడిచియుం బొడిచియుఁ దాచియుం ద్రోచియు మహాయుద్ధంబు సేయుచుం ద్రయోదశినాఁ డిద్దఱుం గిట్టి మల్లయుద్ధకౌశలం బేర్పడం బెనంగు నెడఁ జతుర్దశినాఁటి రాత్రియందు జరాసంధు నతి శ్రాంతభావం బుపలక్షించి యధోక్షజుండు భీమున కిట్లనియె,

చ. విరహితసత్త్వుఁడయ్యెఁ బ్రతి
వీరుఁడు వీని నశేషధారుణీ
శ్వర నికరాపరాద్ధు నతి
సాహసికుꣳ వధియించి నీ భుజ
స్థిరత యెలర్ప నయ్యనిల
దేవు బలంబును నీ బలంబు భా
సురముగ మాకుఁ జూపుము వి
శుద్ధయశోనిధి మారుతాత్మజా. 5

అని ప్రబోధించి పలికిన ననిలతనయుం డనిలదేవునిం దలంచి తత్ప్రసాదంబున నధికసత్త్వసమేతుండై,

ఉ. ఆతనిఁ బట్టి యెత్తి నిహ
తాహితవీరుఁడు వాని ముక్కునన్
వాతను గర్ణరంధ్రముల
వారక శోణితధారలొల్కఁగా
వాతసుతుండు వీచె శత
వారము లుద్ధతచండవాత సం
ఘాత వివర్తమాన తృణ
ఖండసముండగుచుండ మాగధున్. 6

క. వెఱచఱవఁ బట్టికొని వడిఁ
జఱచి జరాసంధు నొడలి సంధుల యెమ్ముల్
విఱిచి వధియించి యార్చెను
వఱలఁగ భీముండు భువనవలయంబదురన్. 7

—నన్నయభట్టు

# 7. వసంత వర్ణనము



లయగ్రాహి

కమ్మని లతాంతములకుమ్మొనసివచ్చు మధు
పమ్ముల సుగీత నినదమ్ము లెసఁగం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి ముకు
ళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిలకులమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు వీచె ననిశమ్ము సుమనోభా
రమ్మున నశోకనికరమ్ములును జంపకచ
యమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్. 1

చందన తమాలతరులందు నగరు ద్రుమము
లందుఁ గదళీవనములందులవలీ మా
కందతరుషండములయందును విలోలదర
విందసరసీవనములందు వనరాజీ
కందళిత పుష్ప మకరందరసముం దగులు
చుం దనువు సౌరభమునొంద జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందములలం దురఁగ
మందమలయానిల మమందగతి వీచెన్. 2

—నన్నయభట్టు

# 8. భీష్మార్జునుల యుద్ధము

తే. కనకమయ తాళకేతువు గ్రాల జిరత
టిల్ల తాలీలఁ గలిగి శోభిల్లు నంబు
దంబుచాడ్పున సురనదీతనయుఁడున్న
వాఁడు సూచితె మత్స్యభూవరతనూజ. 1

క. బలువిడి మన దివ్యాస్త్రం
బుల చవిసూపంగవలయుఁ బోనిమ్ము రథం
బలసగతి నతనిదెసకని
పలికిన నత డట్లచేసెఁ బరమప్రీతిన్. 2

ఉ. శాంతనవుండు నప్డు నిజ
శంఖము గౌరవరాజసైన్యముల్
సంతసమంద నొత్తుచు స
సంభ్రమలీల నెదుర్కొనంగ దు
ర్దాంత భుజాబల ప్రకట
దర్పమెలర్ప నగుండు నొత్తె ది
గ్దంతినికాయ కర్ణపుట
దారణ విత్తము దేవదత్తముఁ. 3

తే. మలసి అంకెలువైచుచు మాఱుకొనిన
వృషభములభంగి నక్కుఱు వృషభులిట్లు

సమదగతి జేరనెడఁ జూచి రమరులర్థి
ననిమిషత్వంబు దమ కప్పు డచ్చుపడఁగ. 4

ఇవ్విధంబున గనుంగొనుచు వారలు దమలోన,

క. మనలను దానవులను గడ
చినయవి భుజబలము లస్త్రశిక్షావిధముల్
గొనియాడఁ గొలఁదిగా దీ
తని నాతఁడ యతని నితఁడ తగుఁ జెనయంగన్. 5

సీ. అనుచుండ సైన్యంబు లార్పులుఁ బెడబొబ్బ
లును దూర్యనాదంబులును జెలంగఁ
బేర్చి యొక్కుమ్మడి భీష్మునగ్గింపంగ
నతఁడు నిశాత బాణాష్టకమున
బడగపై హనుమంతు నొడలును బహు శరం
బులనందుఁ జెలఁగెడు భూతములను
దశవిశిఖముల రథ్యములను సారథి
నేసె వాసవియును నెసకమెసఁగ

తే. నగ్గలిక గాండివంబు చక్రాకృతి ప్ర
కాశవహ్ని స్వరూపత గలిగి విడుపు
తెఱపిగానంగ రాకుండ మెఱసి యొప్పు
సాంద్రసాయకతతి నాకసంబుఁ గప్పె. 6

తే. అర్జునుడు గవియించిన యంపమూడ
మంచు దళముగఁ గప్పిన మార్గణాంశు

జాలముల వెస విరియించె శాంతనవ ప
తంగుఁ డుద్ద్యోతమానప్రతాపలీల. 7

క. అమరేంద్రతనయు డుగ్రా
స్త్రములవడిం గురియఁ గురియఁ దరమిడి వానిం
దుమురుగఁ జేయుచువచ్చెను
సమరోల్లాసంబు మెరయ శంతనుసుతుఁడున్. 8

క. అర్జునుఁడు దివ్యబాణ
స్ఫూర్జితదోశ్శక్తి దనకుఁ జూపిన నతఁ డ
త్యూర్జితబలుఁడై నియమో
పార్జిత ఘోరాస్త్రవితతిఁ బ్రతిహతిఁ జేసెన్. 9

క. కవ్వడి యిమ్మెయి నేసిన
నవ్విధమున నా శరంబులన్నియు దాదా
దవ్వులన నిలువరింపఁగ
వివ్వచ్ఛుడు గినిసియేసె విలువిఱుగంగన్. 10

మ. తన కోదండము ఖండితంబగుడుఁ గ్రో
దంబార మందాకినీ
తనయుండప్పు సటావిలుంతన సము
ద్యత్కోప సింహాకృతిన్
ధనువొం డుద్ధతలీల నెత్తికొని య
స్త్రశ్రేణిఁ బర్వించె న
ర్జునుపైఁ దాకిరి చక్రరక్షకులు నా
ర్పుల్మింగి ముట్టన్వడిన్. 11

చ. విజయుఁడు వారి నెల్ల నొక
వ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్ము సాయక
వ్రజము నడంచియున్ రథము
వాజులనొంచియు నాజికేళియం
దజితవిలాసముల్మెఱయ
నప్పుడు విస్మయమందుచుండెఁ గుం
భజముఖ యోధవీరతతి
ప్రస్తుతిసేసిరి సిద్ధఖేచరుల్. 12

క. కొండొకయెడ గని శాంతన
వుండాఖండల తనూభవుని వలమూఁపు
ద్దండ భుజబలము మెఱయఁ బ్ర
చండాస్త్ర క్షతముసేసె సరభసవృత్తిన్. 13

చ. కినుక మనంబునం గదిరి
క్రీడి పితామహు విల్లు వ్రేల్మిడిం
దునిమి నితాంత గాఢ రయ
దోర్విభవంబున నొండువిల్లు గై
కొని మెడి సందున న్నినిచెఁ
గ్రూరశరంబు ఉరంబునందు గ్ర
క్కున నతఁ డొల్లఁ బోయి రథ
కూబర మూఁతగనిల్చి సోలుచున్. 14

—తిక్కన సోమయాజి

# 9. అభిమన్యు వివాహము



క. కలువడములు మణితోరణ
ములుఁ గట్టిరి క్రముకకాండమోచాస్తంభం
బులు నాఁటిరి కుంకుమమునఁ
గలయ నలికి ముగ్గులిడిరి కర్పూరమునన్. 1

క. వివిధాలంకరణంబుల
నవకాంతివహించి పట్టణంబు వివాహో
త్సవ మాధవలక్ష్మికి లలి
త వనంబై యెలమి కలిమితావలమయ్యెన్. 2

ఉ. తాను సుదేష్ణయు న్సుతులుఁ
దమ్ములు బంధులు గంధమాల్య నా
నా నవరత్నభూషణ మ
నఃప్రియ మాంగలిక ప్రసాధనా
నూన విభూతి మత్స్యవిభు
డుజ్జ్వలలీల వహించి భూమిదే
వానయనాది కృత్యపరు
లైన జనంబుల గారవించుచున్. 3

గరువంపు సంభ్రమంబుతోడ నిజమందిరంబునందు,

సీ. అమలరత్న ప్రదీపావళి మెఱుఁగిడఁ
బనిచి మణిస్తంభపంక్తి గ్రొత్త
జిగిఁ దళుకొత్తునట్లుగఁ దొడయించి వి
చిత్ర వితానముల్ నెలువుమిగులఁ
గట్టించి నూత్నముక్తా దామములతోడఁ
గుసుమమాలిక లెడ గ్రుచ్చిగ్రేలఁ
గీలింప నియమించి కేవల మంగళ
భూరుహ పల్లవతోరణములు
తే. సంఘటింప నియోగించి చందనమునఁ
బరిణయాగార మలుకంగఁ బాణి యాణి
గలుగు ముత్తియములు ముగ్గుగా నొనర్పఁ
జతురపుణ్యాంగనాజనతతిఁ బొనర్చె. 4

క. వైదిక లౌకికవిధి సం
పాదిత వివిధార్థ వస్తు భరితత్వమునన్
వేదిక పొలుపగునట్లుగ
మోదమునఁ బురోహితుండు మునుకొని చేయన్. 5

క. ఉత్తర నలంకరింప ను
దాత్తాభరణాది వస్తుతతి యొసఁగి నరేం
ద్రోత్తముఁడు నేర్పుగల చెలి
కత్తియలంబుచ్చెఁ బ్రీతి గడలుకొనంగన్. 6

ఇట్లు వైవాహిక వర్తన సంవిధాన సావధానుండగు మత్స్యమహీనాథుండు మాహూర్తికాది శిష్టజనులు పరివేష్టింప నుండి లగ్నంబాసన్నంబగుచు వచ్చెనని ధర్మతనయున కెఱింగింపం బనిచిన నతండు సనుజ తనుజ సహితంబుగా నలంకృతుండై వివిధప్రసాధన శోభితులగు సమస్తబంధుజనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబు సేయించి భద్రగజారూఢుం జేసికొని యేనుంగులం బేరుగల వారువంబులను మట్టపు దట్టంబుసేసికొని మణిగణంబులు నంబరనికరంబులుం బుష్పపుంజంబులు ఫలప్రచయంబులు లోనుగాఁగల యోగ్యవస్తువులు విస్తరిల్లిన క్రొంత నడవ మంగళతూర్యనాదంబులు విప్రాశీర్వాదంబులు మాగధగానంబులు వందిజన వాక్యసంతానంబులుం జెలంగ వాసుదేవ పురస్సరంబుగా విరాటు మందిరంబున కేతెంచి శంఖ జయఘంటా పణవాది నిక్వణంబుల తోడ నెదుర్కొని చల్లుసేసలు గైకొనుచుం జొత్తెంచిన,

క. విరటుఁడు సంభ్రమమును నా
దరమును భక్తియును నాత్మఁ దలకొనఁ బూజా
పరుఁడై సమయ సముచితా
చరణంబులు నిర్వహించె సమ్మదలీలన్. 7

తే. విహిత పరిపాటితో విప్రవృద్ధజనులు
పుణ్యకర్మ పరంపరఁబూని నడప

నర్థిఁ గృష్ణ యుధిష్ఠిర పార్థ మత్స్య
వసులు చెరయొద్ద నవ్వధూవరుల నిలిపి. 8

సాంవత్సరిక దత్తకాలకళావిశేషంబుల మంగళతూర్యం
బులు సెలంగ నత్తెర యెత్తించిన,

ఉ. వీనులఁ దియ్య మెక్కుమును
విన్కిఁ బరస్పరరాగవృత్తిలో
నూనినఁ జూచువేడుకల
నువ్విళులూరెడు నెమ్మనంబుల
చ్చో నొక యింతసేపు నెడ
సొచ్చుట కోర్వకయుండ నున్న య
మ్మానినియుం గుమారుఁడును
మారవికారము లంకురింపఁగన్. 9

అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు,

సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపైఁ బ్రాలి
తివుటమై నునుఁగాంతి తీపుగ్రోలు
సుందరీరత్నంబు చూపు మనోహరు
నడుగులయొప్పుపై నల్లనడరుఁ
బతివిలోకనములు పడఁతుక మైఁదీవఁ
గలయంగఁ బలుమఱు మెలఁగుచుండు
వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున
నెగసి మోమునసోఁకి మగిడివచ్చు

తే. నొండొరువుల లేఁజెమటలనూని వ్రేఁగు
పడినచాడ్పున నవయవభంగులందుఁ
దగిలి మఱపున దడయు నిద్దఱ విశాల
నయనదీప్తులు నెఱుకువ బయలుపడఁగ. 10

తదనంతరంబ,

తే. ఒండొరుల దోయిళుల నినుపొందఁజేయు
నక్షత్రప్రకరంబు లన్యోన్య మస్త
కములఁ బోసిరి మందార కల్పలతలు
విరులఁ గలయ నొండొంటిపైఁ గురియునట్లు. 11

చ. లలిత తనూవిలాసముల
లజ్జకతంబున జేసి మున్ను వి
చ్చలవిడిఁ బర్వఁగా వెరవు
సాలక యోరలు వాఱుచూపులన్
లలిఁ దలఁబ్రాలు వోయు నెడ
లం దగవొందిన నూలుకొల్పి యి
మ్ములఁ బరఁగింతు రొండొరుల
మోహనమూర్తులపై వధూవరుల్. 12

తే. చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు
తెఱఁగుదోఁపఁ గెంపారెడు తీగఁబోడి

మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్ర
హించెఁ బల్లవాలంబి మత్తేభలీలన్. 13

ఇట్లు పాణిగ్రహణం బాచరించి,

క. పెనుఁగుదుట నిడిన చూతం
బును నవమాలికయుఁ బోలెఁ బొలుపొంది రతం
డును సమ్ముగ్ధయు నెకా
సనమున నున్నపుడు నూత్న సౌభాగ్యమునన్. 14

సీ. కోర్కులు గెడగూడుకొని పారమేదిన
చిత్తంబె యూటలఁ జిగుళులొత్తెఁ
బులకాంకురములకుఁ దలతాకులై యిరు
మేనుల మవ్వంబు మిగిలి పొదల
దళివేచి చనఁబోయి తడఁబడి మార్పడి
వడిచూపు లొదటఁ బయలుపడఁగఁ
జెమటలు తావులు తమలోనఁ గలసి వే
ఱొక్క సౌరభమయి చొక్కుసేయ

తే. గాఢ సంస్పర్శభంగులు గలుగునట్టి
హోమసమయ కృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిటఁ బొరిఁ బొరిఁ గ్రమ్మ దేర
సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు. 15

—తిక్కన సోమయాజి

# 10. కార్య సాధనము



సీ. ప్రారంభముల కెల్లఁ బౌరుషమ్మును దైవ
మును సాధనమ్ములు వినుము వాని
లోన నొక్కటి చేతఁగానేరదనఘ త
త్ఫలసిద్ధు లెట్లన్నఁ దఱుచు వాన
కారు పొలంబునఁ గల్గెనేనియుఁ గొల్చు
గావింపనేర్చునే కలవిధమున
వలనేర్పడఁగ దున్నఁ జొలములోనైన వ
ర్షంబు లేకున్న ధాన్యంబులగునె

ఆ. వె. కాఁపు లావు వెఱవుఁగల్గి కర్షనము సే
యంగ వృష్టి దగినయట్లఁ గలుగ
ఫలము గల్గునట్లు పౌరుషంబునకు దై
వంబు దోడుపాటు వలయునెందు. 1

అదియునుంగాక,

క. తగుపని కుద్యోగించుచుఁ
దగ వెఱఁగెడు హితుల కనుమతంబుగఁ జేయన్
జగతీసురవర కార్యము
లగువారికిఁ గలుగువిధి సహాయత్వంబున్. 2

క. ధర్మముఁదప్పక నయగతిఁ
గర్మాచరణంబు నడుపఁగా ఫలసిద్ధుల్
నిర్మలయశయగుఁ దప్పినఁ
బేర్మిచెడదు నిందరాదభేద్యోత్సాహా. 3

ఉ. నీతిదొలంగి కార్యముల
నెట్టన నాగ్రహావృత్తిజేసినన్
బ్రీతిగ సిద్ధిబొందినను
భీతిజుగుప్సయుఁ బుట్టు భూజను
ల్వేతురు చేయు చేఁతలు ఫ
లింపక తక్కినమున్నవచ్చు న
త్యాతురతాస్పదంబులగు
నాపద లిద్ధవివేకవైభవా. 4

ఉ. క్రోధము లోభమున్ భయముఁ
గూరిన చిత్తముతోఁడ నిష్క్రియా
సాధనవృత్తి దుర్జనుఁడు
సజ్జనులాడఁగఁ జేయుకార్యముల్
బాధలబొందకున్నె సిరిఁ
బాయఁగఁ జేయకయున్నె వానిఁ దీ
వ్రాధి నితాంత దుఃఖ హ్రద
యత్వము దేరకయున్నె వానికిన్. 5

చ. వినుము కురుక్షితీశుఁడు వి
వేక విదూరుఁడు క్రోధ లోభముల్
మనమునఁ బేర్చినన్ దురభి
మానముతో హితు లెంతచెప్పిన
న్వినక బహుప్రకారముల
నిందకునోర్చి పరాభవించె స
జ్జనులగు పాండుపుత్రులన
సత్పథవృత్తికిఁ జేటుదప్పునే. 6

ఆ. వె. మహితశాస్త్రకలిత మార్గంబువిడిచి ని
జేచ్ఛఁ బగఱగెలువ నెవ్వఁడడరు
వాని నయ్యధర్మ వర్ధనక్రౌర్యము
యెవ్విధమునఁ జెఱుచు నింత నిజము. 7

—తిక్కన సోమయాజి

# 11. శరదాగమము



ఉ. భూసతికిం దివంబునకు
బొల్పెసగంగ శరత్సమాగమం
బా సకలప్రమోదకర
మై విలసిల్లె మహర్షి మండలో
పాసిత రాజహంసగతి
భారతిఁ బ్రసన్న సరస్వతీ కమ
లాసన శోభితం బగుచు
నబ్జజయానముతో సమానమై. 1

ఉ. శారదరాత్రు లుజ్జ్వల ల
సత్తర తారక హారపంక్తులన్
జారుతరంబులయ్యె విక
సన్నవ కైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము
దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి
పూరము లంబరపూరితంబులై. 2

—నన్నయభట్టు

చ. స్ఫురదరుణాంశు రాగరుచిఁ
బొంపిరివోయి నిరస్త నీరదా
వరణములై దళత్కమల
వైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంస సారస మ
ధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరమువెలింగె వాసర ము
ఖంబులు శారదవేళఁ జూడగన్. 3

శా. దానాంభఃపటలంబునం బృథు
పయోధారావలిం దాల్చి గ
ర్జా నిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్ర
చ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూ
ఢాకారతం డిగ్గ నాఁ
గానొప్పారె మదోత్కట ద్విరద సం
ఘంబుల్ వనాంతంబునన్. 4

క. కల నీలకంఠ కోలా
హల లీలలుసెలఁగె రాజహంస కులంబుల్
దిలకించె సప్తపర్ణా
వలి వికసిత కుసుమ దివ్యవాసన లలరెన్. 5

మ. అతిగాంభీర్య విభూతి నేకచులుకా
హంకార నిశ్శేష శో
షిత పాథోధి పయస్కుఁడైన మునిదోఁ
చెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్య దిగంతవీథిఁ బ్రకట
క్రీడా కళాగర్వ గ
ర్జిత మండూక కళంకితాంబు శుచితా
సిద్ధి ప్రదాచార్యుఁడై. 6

తే. విశద శారదాంబు పరివేష్టనమునఁ
బొలుచు గగనంబు ప్రతిబింబమో యనంగ
వికచకాశవనీ పరివేష్టనమున
నతిశయిల్లె నిర్మల కమలాకరములు. 7

—ఎఱ్ఱాప్రగడ

# 12. యుధిష్ఠిర సభ

క. విమలమణి మయము లగుచు
లములం గంబముల గోడలను వేదులఁ గు
ట్టిమములఁ జుట్టిన ప్రాకా
రములను గరమొప్పుచుండ రచియించె సభన్. 1

సీ. సురుచిర హరినీల కిరణజలంబులఁ
బద్మరాగారుణ పద్మములను
రాజతరాజీవ రాజహంసాళుల
నిర్మల సౌవర్ణ కూర్మములను
కమనీయ వైదూర్య కుముదంబులను వజ్ర
మీన మౌక్తిక నవఫేనములను
మరకత శైవలోత్కరముల విలసిల్లఁ
గొలననిసన్మణి స్థలముచూచి
పలుఁగురాల కుడ్యముల రుచుల్గప్పిన
జలములున్న యెడలు వెలయఁజూచి
యనుపమస్థలంబులని జను లెఱుఁగక
యుండునట్లుగా మయుండు సేసె. 2

మఱియు సకలజన మనోహరంబులైన నానావిధ యంత్రంబులును ననవరత కుసుమ ఫల భరితంబులైన తరువనంబులును వికచ కమల కుముదాభిరామంబులైన జలాశయంబులును వివిధ విచిత్రోపలవర కమల కువలయాది తోరణంబులైన విటంకప్రదేశంబులునుం గలిగి దశకిష్కు సహస్ర ప్రమాణాయతంబును సహస్రకర ప్రభాప్రసర విస్తార విభూతి

యును వివిధరత్న విభవాభిశోభితంబునుంగా నపూర్వ సభా
భవనంబుఁ బదునాలుగు నెలలు నిర్మించి ధర్మరాజు చేత
సత్కృతుండయి మయుం డరిగిన,

ఉ. వీరుఁడు ధర్మజుండు పది
వేవురు విప్రులకొప్పఁ బాయసా
హారము భక్తిఁ బెట్టి మఱి
యందఱకుం జెఱి వేయివేయి వి
స్తారయశుండు ధేనువుల
ధర్మవిధిన్ మణిముద్రికా ద్యలం
కార దుకూల పుష్పఫల
గంధయుతంబుగ నిచ్చె లీలతోన్. 3

అనుజ సహితుండయి దైవజ్ఞదత్త శుభముహూర్తం
బున ధౌమ్యాది భూసురాశీర్వాద పుణ్యాహనాదంబు లెసంగ
సభాప్రవేశంబు సేసె నంత నయ్యవసరంబున,

మ. మదమాతంగ తురంగ కాంచన లస
న్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనివచ్చి యిచ్చి ముదమొ
ప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతు శీతనగమ
ధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభా స్థితు జగ
త్పూర్ణ ప్రతాపోదయున్. 4

—నన్నయభట్టు

# 13. ఇంద్రప్రస్థము



సీ. ద్వైపాయనుండును ధౌమ్యుండు నాదిగా
భూసురుల్ సూత్ర విన్యాస మమరఁ
జేసి శాంతికవిధుల్ సేయంగ సుప్రశ
స్తంబైన రమ్యదేశంబునందు
వాసవాధిష్ఠుఁడై వసుధకు నేతెంచి
పేర్మితో సవ్విశ్వకర్మపురము
నిర్మించె నదియును నిరుపమలీలలఁ
దనరి యింద్రప్రస్థ మనఁగ నింద్రు

ఆ. పురముతోఁ గుబేరు పురముతో వరుణుని
పురవరంబుతోడ నురగరాజ
పురవిభూతితోడ నురువిలాసంబుల
సరియనంగ నొప్పె ధరణిమీఁద. 1

ఉ. ఇమ్ముగ విశ్వకర్మ రచి
యించిన కాంచనహర్మ్య తుంగశృం
గమ్ముల రశ్మిరేఖలు ప్ర
కాశములై కడుఁబర్వ తత్సమీ
పమ్మునఁ బాఱుచున్న ఘన
పంక్తులయందచిరద్యుతి ప్రతా

నమ్ముల( గ్రేడిసేయుచు న
నారతము న్వెలసిల్లు నప్పురిన్. 2

చ. అలఘుతరమ్ములై తుహి న
హార సుధారుచి నిందురోచి రా
కుల శశికాంత వేది పృథు
కూట గళజ్జలనిర్ఝరంబులన్
విలసిత జాహ్నవీ విమల
వీచి విలోల లసత్పతాకలం
బొలుపగు( దత్పురీభవన
ముల్ హిమశైలముఁబోలి యున్నతిన్. 3

చ. వననిధిలోని రత్నములు
వాసుకిమూర్ధజరత్న సంఘముల్
గొనఁగ నవశ్యమున్ జనుల
కు న్నమకూరదుగాన నెప్పుడుం
గొనుఁడు పరార్ధ్యరత్నములు
గోరినవానిన యిత్తు మన్నెలం
గునఁ బచరింతు రంగళులఁ
గోమటు లప్పురి సిద్ధరత్నముల్. 4

క. శరనిధి నినాదనిభమగు
పురఘోషముఁ గీడుపటేచి పోలుపుగఁ గడు న

స్ఫురవరమునను మహీసుర
వర వేదాధ్యయన రవ మవారితమయ్యెన్. 5

చ. పరిఘజలంబులం దమల
పంకరుహోత్పల కైరవాది సుం
దర కుసుమంబులున్ ఘనప
థంబున నుజ్జ్వలతారకా నిరం
తర కుసుమంబులున్ వెలయుఁ
దత్పురవప్రము పాదపీఠికా
శిరములకొప్ప నర్చనలు
సేసిన పువ్వుల యవ్విధంబునన్. 6

చ. తమము నడంచుచున్ వెలుఁగు
తత్పుర గోపురశాత కుంభకుం
భముల విచిత్రసన్మణిగ
భస్తివితానములన్ విచిత్ర వ
ర్ణములగు నాత్మవాహముల
నమ్మక పల్మఱుఁ జూచి యన్యవా
హములని సంశయప్రణి హి
తాత్ముఁ డగున్ హరిదశ్వుఁ డెప్పుడున్. 7

చ. సరళ తమాలతాల హరి
చందన చంపక నారికేళ కే

సర కదలీ లవంగ పన
స క్రముకార్జున కేతకీ లతా
గరు ఘన సారసాల సహా
కార ముఖార్వ్హా మహీజరాజ సుం
దర నవనందనావళుల
తత్పరబాహ్యములొప్పఁ జూడఁగన్. 8

మ. అనిలం బప్పురిఁ బౌరచిత్తముల కత్యా
నంద మొందంగ న
ర్ధినిమిన్నేటి తరంగలన్ బెనగుచున్
దివ్యద్రుమా కీర్ణ నం
దన సందోహము దూరుచున్ వికచ కే
తక్యాది నానాలతాం
త నవామోదము బొందుచున్ సుడియు ని
త్యంబుం గరం బిష్టమై. 9

—నన్నయభట్టు

# 14. ఖాండవ దహనము



చ. పెడిలి సువర్ణపర్వతము
పెక్కుదెఱంగుల వ్రయ్యునట్టు ల
ప్పుడు వివిధప్రకారముల
భూరిశిఖావలి ఖాండవంబు న
ల్గడఁ గొనుం బర్విగాఁ బెఱిగి
[illegible]ంగ హుతాశనుండు సే
ద్పడఁగ [illegible] బ్బగ
పక్షి భుజం[illegible]సమూహముల్. 1

అంత,

సీ. చక్రధరుండయి జలరుహనాభుండు
గాండీవధరుఁడయి పాండవుండు
నుండి రవ్వనమున నుభయపార్శ్వంబులఁ
దొల్లింటి యట్టుల పెల్లురేఁగి
యనలంబు నార్పంగ నార్చుచుఁ బఱతెంచి
వనరక్షకులు పార్థు సునిశితాస్త్ర
ధారల నపగతదర్పులై యరిగిరి
యమసదనంబున కమితబలులు

శిఖియు నుగ్రదీర్ఘ జిహ్వాలుసాఁచి యు
ద్ధుర సమీరణంబు తోడుసేసి
కొని యుగాంతకాల కుపితానలాకారుఁ
డయ్యె ఖాండవమున నద్భుతముగ. 2

మ. ఘనధూమధ్వజ దహ్యమానలవలీ
కర్పూర తక్కోల చం
దన కాలాగరు సల్లకీతరుల యు
ద్యద్ధూమ ధూపాను వా
సన నొప్పెన్ సురభీకృతంబు లగుచున్
సంక్రీడమానామృతా
శన విద్యాధర సద్విమానవితతుల్
సావిత్ర వర్త్మంబునన్. 3

చ. జ్వలనశిఖాలియున్ విజయు
సద్విశిఖాలియుఁ జుట్టుముట్టి నం
దలరి భయాకులంబులగు
తద్వనజీవుల యార్తనాద మొం
దొలయుచు నొక్కపెట్టదివి
నుద్గతమయ్యె నమంద మందరా
చల పరివర్తన ప్రసభ
సంక్షుభితార్ణవ ఘోషఘోరమై. 4

క. నెగయుడు నెగసి పిఱుందం
దగిలెడు మిడుఁగుఱులచేత దగ్ధచ్ఛదమై
గగనమునఁ బఱవనోపక
ఖగనివహము వహ్నియంద కడువడిఁబడియెన్. 5

క. తన తేజోజాలము వ
ర్తన దగ్ధములగు ననేకవిధ దేహుల దే
హానికాయంబుల బహువిధ
తనువులుగలవాఁడపోలె దహనుండొప్పెన్. 6

చ. అమితకృశానుదగ్ధమగు
నయ్యమరేంద్రు వనంబులోని యు
త్తమసలిలాశయావళుల
తప్తజలంబులయం దపేత జీ
వములయి తేలుచుండె వర
వారి చరంబులు వారి పక్షులుం
గమలె నశేషకోక నద
పంక్తులు శైవలంబులున్. 7

క. అలుగులపడి ఖాండవమునఁ
గల యాశీవిష మహోరగములెల్ల విషా
గ్నులు గ్రక్కుచు నత్యుగ్రా
నల బహుళజ్వాలలందు నాశమువొందెన్. 8

—నన్నయభట్టు

# 15. ప్రళయ ప్రకారము



కృత త్రేతా ద్వాపర కలినామంబు లయిన యుగంబులు నాలుగును బండ్రెండు వేల దివ్యవర్షంబులం బర్యవసితంబులగు నియ్యుగంబులు నాలుగు నొక్క మహాయుగంబనంబరఁగు నమ్మహాయుగ సహస్రపర్యంతంబైన కాలంబు బ్రహ్మకు దివంబనంబడుఁ దద్దివసావసానంబునందు శతవార్షికంబైన యనావృష్టిదోషంబు ప్రవర్తిల్లునప్పుడు,

ఆ. సప్తహయుఁడు మూర్తి సప్తకంబు ధరించి
కరము వేఁడి మిగులు కరములొప్ప
నదనదీజలములును దధిజలంబులుఁ
బీల్చి జగములెల్లఁ బ్రేల్చుఁగడఁగి. 1

చ. దినకర తీవ్రతేజమున
దీప్తహుతాశనుఁ డయ్యుగాంత సం
జనిత మహాసమీరణ వ
శంబున బేర్చి నగవ్రజంబుతో
మనుజులతోడ నిర్జర స
మాజముతోడ భుజంగపంక్తితో

దనుజులతో జగత్త్రయము
తత్క్షణమాత్ర నొనర్చు నీవుగాన్. 2

తదనంతరంబ,

మ. సితపీతారుణ నీలపింగరుచులై
స్నిగ్ధంబులై యుద్యతా
యత విద్యుల్లలితంబులై ఘనగిరిం
ద్రాకార ఘోరంబులై
తతనిర్ఘాత నిపాత భీమభిదుర
ధ్వానంబులై సంతతో
ద్ధత సంవర్త వలాహకంబులు వెసం
దోతెంచు దిగ్భిత్తులన్. 3

ఉ. పెల్లుగఁబాఱు తజ్జలము
పెక్కువ నొక్కట నమ్మహానలం
బెల్లను నాఱిపోవఁ బృథి
వీశ్వర మేరులు నబ్ధులున్ వెసం
దొల్లిటియట్ల నిండుఁ బటు
తోయద సంఘము లంతఁబోక గ
ర్జిల్లుచు వెండియుం గురియుఁ
జిత్రముగాఁగ ననేక కాలముల్. 4

శా. ధారాపాత నితాంతవేగమున ని
ద్ధాత్రీతలం బాహతం
బై రూపేది మునుంగఁ దోయములలో
నత్యంత గంభీర వాః
పూరంబంతయు ముంచి మించుటయు ది
గ్భూమీ నభోభాగముల్
వేరూపింపఁగ రాకయుండఁ దమము
ల్వ్యాప్తించు త్రైలోక్యముల్. 5

తే. అంతఁ బరమేష్టి చోదితమైన యొక్క
మారుతము నలిరేఁగి దుర్వారభంగి
విలయకాల విశృంఖల విపులవారి
ధర చయంబులనెల్లను విరియనడచు. 6

—ఎఱ్ఱాప్రగడ

# శబ్దార్థసూచి



## ప్రథమ భాగము

1 పోడి=ఒప్పు
పోడిగ=ఒప్పిదముగ
పోడవు=రూపు
దడ=వేగము (గ)
బూది=బూడిద
2 ఓటుపడు=నష్టపోవు
ఓపు=చాలు, (సరిపోవు) సమానమగు
అరణి=యజ్ఞమునందు నిప్పు చేయుటకు సంగ్రహింపఁబడు కఱ్ఱ
అర్మిలి=ప్రేమ
దురటిల్లు=దుఃఖించు
వెరవరి=ఉపాయశాలి-ఉపాయముకలవాఁడు
వరలు=ప్రకాశించు
3 సవరించుకొను=కూర్చుకొను
మిఱుత=మెరక నేల
వఱ్ఱు=ప్రవాహము
వనస్పతి=పూయక కాచెడిచెట్టు (ఉ॥మఱ్ఱిచెట్టు)
సీతు=చలి
వలగొని=ప్రదక్షిణముచేసి
4 బుభుక్ష=ఆకలి
అసిపుత్రిక=(సూరకత్తి) చురకత్తి
తుల=త్రాసు

6 వలఁకులు=దిక్కులు
ఓలి=వరుస
దర్శ—అమావాస్య
దర్దురము=కప్ప
పురణించు=పోలు
శిలీంధ్రము=పుట్టగొడుగు
సురగోపము=ఆర్ద్రపురుగు

7 ఉరలు=రాలు
విదుర్చు=విదలించు (దులుపు)
విరియు=తొలఁగు

8 పరోక్షము=వెనుక, తరువాత
ఎత్తి=పూని
అఱ=మోసము, కీడు
ప్రమాణకోటిస్థలము=తీరము, ఒడ్డు
నీలుగు=ఒడలు విరుచుకొను
ఆరంగన్=ఒప్పునట్లుగా
కైతవము=కపటము, మోసము
సమయము=ప్రతిజ్ఞ
జనపదము=గ్రామము
అరిది=అశక్యము
తపనన్=కష్టముతో

9 ఇమ్ముల౯=సుఖముతో-సుఖముగా
వల్లరి=తీగె
ఉగ్మలి=ఆడుది (స్త్రీ)
క్రోవులు=కాలువలు
అలుగులము=బాధ
ఆఅడి=వ్యర్థము
10 పుఱిలోట=వెనుదీయుట
మ్రోడుపడు=తగ్గు.
లంపటుడు=మిక్కిలి ఆసక్తి గలవాఁడు
గజాలస్యము=మందగమనము,మెల్లగానడుచుట
తానకము=మండి-వస్త్రాదులు కూర్చుండువిధము
ఉపతాఱి=కుస్త్రీయందలి నేర్పు
తోరహస్తము=పేచీ, కుస్త్రీలోవిశేషము
ఒత్తారవు=గట్టిగా పట్టుకొనుట
జళికి=సమీపించి
విన్నాణము=మెడపట్టు
దొరకొను=కలుగు, లభించు
సీసాన=కుస్త్రీపట్టుచేత
సీసము=కుస్త్రీపట్టు
ఉప్పళించు=మీదికెత్తు
హత్తును=కలియును
పిలుకురు=భయముచే అంగములు విలవిలపోవు

తాళము=కు స్త్రీపట్లలో విశేషము
పెలుకురి=అవయవములందుగలశక్తి తగ్గిపోయి
అప్పళించు=చఱచు
11 ఇక్కలు=ఇండ్లు
పడ్డెర=ప్రకాశము
12 పురుడించు=పోలు, పోలికయగు
పరువు=సమూహము-గుంపు--ఒకజాతి జంతు
సమూహమును దెలుపుపదము
అగ్గలిక=పూనిక
చీరు=పిలుచు
ఈలకరుచు=ప్రాణము బిగపట్టు
నిగిడి=వెళ్లి, సాగి
ఎడలు=చెదురు
తలరు=కలవరపడు

ద్వి తీ య భా గ ము

1 శరధి=అమ్ములపొది
పింఛు=బంతి
దిగిచికొని=తీసి
పలితుఁడు=పండిన వెండ్రుకలుగలవాఁడు
పాడికుఱ్ఱులు=ఆవులు
కుఱ్ఱ=కోడె
రోయు=వెదకు

2 అక్కటికము=దయ
ఒడికపు=తగినటువంటి
అడరు=త్వరపడు
ఎల్లిదము=చులకదనము (తక్కువ)
ఎరియించు=బాధపెట్టు
పొరయుట=పొందుట

3 చాతుర్మాస్యము=యతులచే జేయబడు వ్రతము. ఆషాఢ శు ౧౧ మొదలు కార్తిక శు ౧౧ వరకును నొక యూరనె యుండి యాచరింపబడును.
వీక=పూనిక
ఆక=అడ్డగింత

4 ప్లవము=వాటమైన పల్లపునేల
ఉరియు=ధ్వనించు
గోధ=వింటి నారిదెబ్బ తగులకుండ చేతికి కట్టుకొన్న చర్మము
రమణ=ప్రీతి
అగారము=ఇల్లు
ప్రోత్థము=పుట్టినది

5 జొంపము=గుంపు, గుబురు
ఎడ=చోటు
కేణిసేయు=పరిహాసించు
నలి=అనయము

గోడి=అణగుడు
నిర్వాఢి=ప్రసిద్ధి
కదంబము=సమూహము
చక్కటి=న్యాయము, రీతి
బరవసము=ధైర్యము, పూనిక
బాసట=సహాయము
పల్లటిల్లు=తెల్లబోవు
6 కిట్టు=సమీపించు
తాచి=పట్టుకొని
వెఱచఱచు=భయపడు
పొంపిరివోవు=అతిశయించు
8 అచ్చుపడు=స్పష్టమగు
ఎసకము=అతిశయము, గొప్పతనము
ఎసగు=కలుగు
తుమురు=చిన్నచిన్న ముక్కలు
వలమూపు=కుడిభుజముయొక్క శిరస్సు
ఒల్లబోయి=మూర్ఛనుపొంది
9 కలువడము=జెండాకఱ్ఱలకు గట్టు పూలదండ
క్రముకము—పోకచెట్టు
మోచ=అరటిచెట్టు
లలితవనము=ఉద్యానవనము, పూలతోట
తావలము=ఉనికిపట్టు, వసియించుచోటు

(7)

ప్రసాధనము—అలంకరించుకొనుట
గరువంపు=విరివియైన, అధికమైన
తళుకొత్తు=ప్రకాశించు
తొడయించి=తుడిపించి
కీలించుట=తగుల్చుట, తొడుగుట
వితానము=మేలుకట్టు, చాందినీ
ఎడ=నడుమ (ను)
పాణి=(ముత్యపు) నీరు
ఆణి=గుండ్రముగానుండునట్టి
పొనర్చు=నియమించు
క్రంత=పెండ్లికొడుకువారు పెండ్లికూతునకుఁ
దీసికొనిపోవు ప్రధానద్రవ్యము, దీని
రూపాంతరము "కంత"
సేసలు=అక్షతలు
జొత్తెంచు=ప్రవేశించు
తలకొను=అంకురించు
సాంవత్సరికుఁడు=జ్యోతిష్కుఁడు
తివుట=కోరిక
ఎఱుకువ=తెలివి
నూలుకొలుపు=పురికొలుపు, డీకొలుపు
ఓరులు=అంచులు

మెలపు=నేర్పు

మవ్వము=సౌందర్యము

ఆదట=ప్రేమ, తృప్తి

చొక్కు=మోహము

10 కారు=చవుడు

కొల్చు=ధాన్యము

వేతురు=నిందింతురు

12 వేదులు=అరుగులు

కుట్టిమము=రాతిపలకలతో కట్టిననేల, తిన్నె

పలుగురాయి=తెల్లని రాయి

కిష్కు=మూర; జాన

13 పచరించు=అమర్చు

కీడుపరుచు=తక్కువచేయు

సుడియు=వీచు, (వ్యాపించు)

14 పెడిలి=బీటలువారి

పెల్లురేగు=అతిశయించు

తలరి=చలించి [తలరు (ధా)]

అలుగులపడు=బాధపడు

15 పెక్కువ=ఆధిక్యము; వర్ధనము, ఎక్కువ

విరియు=చెదరు



# వ్యాస లేఖనా భ్యాసములు



1. అతులిత పుష్పపల్లవ ఫలాన్విత భూరుహ భూరివల్లరీ వితతులజారు కైరవ నవీనసరోరుహ షండ మండలాయత సరసీమనోహరములైనపురోపవనంబులఁ సమున్నతవిభవుం డు వాసభవనంబు లొనర్పగ బంచె వేడుకఁ.

తెనుగుమాటలను వాడుకచేయుచు, అభిప్రాయభంగము లేకుండ నీవాక్యమును తిరిగి వ్రాయుడు.

2. ధర్మవు సర్వంబునకు హితంబుగవలయుఁ.

ఈ యభిప్రాయమునుగురించి కొంత చర్చించి వ్రాయునది.

అంశసూచిక:—(1) ఇది ధర్మము—ఇది అధర్మము అని తెలియుటకు మార్గములు=వేదములు, శాస్త్రములు. (2) సమస్తభూతములకును హితమగునా? హితము-ఈ లోకమునా? పరలోకమునా? ఈ లోకముననే యనినచో—హితముకానివారు కొంద రుండవచ్చును—సర్వమునకు హితమన చాలమందికి అని గాని అందరికిని యనికాదు.

3. ధర్మవు నుచితంబు దప్పనివారల నుదితసత్యరతుల దైవంబు రక్షించు దురితవిధుల నెపుడు బొరయకుండ.

ఇందలి యర్థమును విపులముగ వ్రాసి దీని కుదాహరణముగ కథనుగూడ వ్రాయుడు.

4. ఉత్తరకుమార ప్రజ్ఞలు—అనుదాని యర్థమును వివరించి అందుకు తగిన నిదర్శనములను మీరు చదివిన కథల నుంచి యెత్తివ్రాయుడు.

5. రోయుటీగ గాళ్లం బెనగె,

దీని యర్థమును విపులముగ వ్రాసి యుదాహరణముగ నొక కథను కూడ వ్రాయుడు.

6. తల్లియందెక్కుడు ప్రేమ యుండవలెనా? తండ్రియందెక్కుడు ప్రేమ యుండవలెనా? సకారణముగ వ్రాయుడు.

7. శిబి చరిత్రమునకును, కపోతముయొక్క చరిత్రకును గల భేదమును వ్రాయుడు.

8. తిక్కన చేసిన కుస్తీవర్ణనకును నన్నయ మల్లయుద్ధ వర్ణనకును గల భేదము తెలియజేయుడు.

9. నన్నయకృత సుభద్రా పరిణయ వర్ణనకును తిక్కనకృత యభిమన్యు వివాహవర్ణనకును గల భేదమును వ్రాయుడు.

10. మీరు చదివిన కథలలోని సాంఘికచరిత్రాంశము లెవ్వి? వాటిని గూర్చి విస్తరించి వ్రాయుడు.

